Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 26 • 28-6-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# తెలంగాణ ఇస్తామంటే కెసిఆర్‌కు వణుకు!

ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి కెసిఆర్ తిరుగులేని నేత. తెలంగాణ వాదానికి పర్యాయపదం ఆయనే. ఆ ఉద్యమంలో ఎందరు పాలుపంచుకొంటున్నా, తామూ తెలంగాణ అనుకూలురమే అని అన్ని రాజకీయ పార్టీలూ ప్రకటన చేస్తున్నా ఆ ప్రాంతం ప్రజలలో మాత్రం ఉద్యమానికి సంకేతంగా స్థిరపడి పోయాడు కెసిఆర్. అటువంటి నేత తెలంగాణ రాష్ట్రం ఏర్పడే అవకాశం వచ్చిందంటే ఎంతగా సంతోషించాలి? ఎంతగా ఎగిరి పడాలి? కానీ విచిత్రంగా అందుకు విరుద్ధమైన పోకడ కన్పిస్తున్నది ఆయనలో.

ప్రధాని మన్మోహన్‌సింగ్, హోమ్ మంత్రిత్వ శాఖ ఉన్నతాధికారులు ఎంతగా వ్యతిరేకిస్తున్నప్పటికీ తెలంగాణ ఇవ్వాలనే నిర్ణయానికి సోనియా గాంధీ వచ్చినట్లు వార్తలొస్తున్నాయి. అవి వార్తలో, వదంతులో తెలియదు. ఏమైనాసరే అవి తెలంగాణ వాదులందరికీ సంతోషం కల్గించే పరిణామం క్రిందే లెక్క. కానీ కెసిఆర్ మాత్రం చాలా దిగులు పడుతున్నాడు. ఆయనకు రెండు సమస్యలున్నాయి. మొదటిది శాసన సభ ఎన్నికలకు ముందు ప్రత్యేక రాష్ట్రం ప్రకటన వెలువడితే ఉద్యమ ఉధృతి ఎన్నికల మీద వుండదు. అది తన పార్టీ విజయావకాశాలను బాగా హరించి వేస్తుంది. మరొక సమస్య తెలంగాణ ఇస్తే తన టిఆర్ఎస్ పార్టీని కాంగ్రెస్‌లో విలీనం చేస్తానని బహిరంగంగా ప్రకటన చేసి వున్నాడు. ఇప్పుడు కాంగ్రెస్ నిజంగా తెలంగాణ ఏర్పాటు ప్రకటన చేస్తే తన పార్టీని ఏమి చేయాలన్నది ప్రశ్న. ఏ కొంచెం తెలివి వున్న రాజకీయవాది కూడా తనకున్న స్వంత బలాన్ని ఒక జాతీయ పార్టీకి అప్ప చెప్పడు. కాంగ్రెస్ వంటి పార్టీలలో రాష్ట్రస్థాయి నేతలకు స్వేచ్ఛ వుండదు. స్వతంత్రం ఉండదు. అధిష్టానం చెప్పినట్లే వినాలి. కానీ ఇప్పటికిప్పుడు తెలంగాణలో వున్న రాజకీయ పరిస్థితులలో టిఆర్ఎస్ పార్టీకి, కెసిఆర్‌కు తిరుగు లేని రాజకీయ ప్రాభవం వుంది. రేపటి ఎన్నికలలో అదే ప్రధాన పార్టీగా అవతరించే అవకాశం వుంది. పది పన్నెండు మంది ఎమ్పీలను గెలిపించుకొంటే రేపు కేంద్రంలో ఏర్పడబోయే ప్రభుత్వంలో కెసిఆర్ మాట శిలాశాసనంగా చలామణి అవుతుంది. అంతటి సువర్ణావకాశాన్ని వదలుకొని తన రాజకీయ శక్తినంతా కాంగ్రెస్‌కు ధారపోయడం ఆయనకు సుతరామూ ఇష్టం వుండదు.

అయితే తెలంగాణ వాదులలో, ఉద్యమకారులలో అధిక భాగానికి కెసిఆర్ అంటే వళ్లు మంట. విధిలేక ఆయన్ను అనుసరించి వెళ్తున్నారు వారు. చివరకు కెసిఆర్ స్వయంగా సృష్టించిన జెఎసి కూడా ఆయనకు వ్యతిరేకం. ఈ శక్తులన్నీ ఇప్పుడు కాంగ్రెస్ పార్టీ నిజంగా తెలంగాణ ఇస్తే, ఇచ్చిన మాట మీద నిలబడి విలీనం చేయమని ఒత్తిడి తెస్తాయి. స్వపక్షం నుంచి వచ్చే ఒత్తిడిని తట్టుకొని నిలవడం అంత సులభం కాదు. పైపెచ్చు ప్రజలలో కూడా ఒకసారి తెలంగాణ వచ్చేసింది అన్న నిజం తెలిసిన తర్వాత కెసిఆర్ మీద పూర్వపు మోజు, ఆవేశం కొనసాగడం కష్టం. ఈ ఆలోచనతో బాగా మధనపడి పోతున్నాడు కెసిఆర్.

అయితే నిజంగానే సోనియాగాంధీ తెలం

కొరవ 14వ పేజీలో

# రాజకీయమే ప్రధానమా?

రాజకీయవాదుల వృత్తి రాజకీయమే. వారు వేసే ప్రతి అడుగూ ఆ కోణం వైపే పడుతుంది. అందులో తప్పు పట్టవలసింది ఏదీ లేదు. కానీ ప్రజల జీవితాలకు సంబంధించిన అంశాలలో ఆపదలలో కూడా రాజకీయంగా మాత్రమే నడిచే ధోరణి చాలా ప్రమాదకరమైనది. ఈ వారంలో జరిగిన రెండు పరిణామాలు ఈ విషపు వైఖరిని నగ్నంగా ప్రదర్శించాయి.

మొదటిది – తెలంగాణ. దాదాపు పదేళ్ల నుంచి కాంగ్రెస్ పార్టీ ఈ సున్నితమైన అంశంలో రాజకీయ చెలగాటం ఆడుతున్నది. 2004 ఎన్నికల ప్రణాళికలో వారు తెలంగాణ హామీ చేర్చారు. తెలంగాణ కోసమే పుట్టిన టిఆర్‌ఎస్ పార్టీతో పొత్తు పెట్టుకొన్నారు. యూపిఏ ఉమ్మడి కార్యక్రమ అజెండాలో కీలక అంశంగా చేర్చారు. రాష్ట్రపతి పార్లమెంట్ ఉభయ సభలను ఉద్దేశించి చేసే ప్రసంగంలో ప్రస్తావించారు. కానీ ఆ ఐదేళ్లపాటు ఎటూ తేల్చకుండా నాన్చుడు వైఖరి అవలంభించారు. మళ్లీ ఎన్నికలలో కూడా కాంగ్రెస్ వాదులందరూ తెలంగాణ తెచ్చేది మేమే, ఇచ్చేది మేమే అని బీరాలు పలికారు. వైఎస్ మరణం తర్వాత డిసెంబర్ 9తేది చిదంబరం చేసిన ప్రకటనలో తెలంగాణ ఇస్తున్నట్లు ప్రకటించారు. ఆ వెంటనే ప్లేట్ ఫిరాయించారు. శ్రీకృష్ణ కమిషన్ పేరుతో ఒక నాటకం ఆడారు. నివేదిక వచ్చిన తర్వాత దాన్ని చెత్త బుట్టలో పడవేశారు. గులాం నబి ఆజాద్ చర్చల పేరుతో వెటకారాలు చేశాడు. సుశీల్‌కుమార్ షిండే మరొకసారి చర్చల ప్రహసనం నడిపాడు. నెల లోపల తేల్చి పారేస్తానని ఉత్తర కుమార ప్రగల్భాలు పలికాడు. ఆ తర్వాత నెల అంటే ఏ నెలైనా కావచ్చునని ఎగతాళి మాటలు మాట్లాడారు. ఇప్పుడు తాజాగా తెలంగాణ ఇచ్చేది లేదు, ప్యాకేజ్ మాత్రమే అని పత్రికలకు ఉప్పందించారు. దానిపై వ్యతిరేకత రావడంతో మళ్లీ ప్లేట్ ఫిరాయించి తెలంగాణ ఇచ్చేస్తున్నట్లు వదంతులు వ్యాప్తి చేస్తున్నారు.

ఏమిటీ దొంగ నాటకం. తెలంగాణ ఇవ్వాలనుకొంటే అందుకు షరతులేమిటో చెప్ప వచ్చు. లేదు, ఇవ్వకూడదన్న నిర్ణయమైతే ఆ మాటే ప్రకటించి, పర్యవసానాలను ఎదుర్కో వచ్చు. రెండూ లేకుండా అప్పుడొక మాట ఇప్పుడొక మాట మాట్లాడి రాష్ట్ర ప్రజల జీవితాలతో చెలగాటమాడే అధికారం కాంగ్రెస్‌కు ఎవరిచ్చారు? తమ రాజకీయ అవసరాల కోసం పది కోట్ల మంది ప్రజల జీవనానికి సంబంధించి రాష్ట్రాన్ని ఆట వస్తువుగా పరిగణించే దుర్మార్గం ఎందుకు చేస్తున్నారు? కాంగ్రెస్ అధినేత్రికి కానీ, జాతీయస్థాయి నేతలకు కానీ రాష్ట్రం కంటే రాజకీయమే ముఖ్యం కావడం చాలా శోచనీయ విషయం.

ఉత్తరాఖండ్ వరద బాధితుల విషయంలో తెలుగు దేశం, కాంగ్రెస్ పార్టీలు వీధి కొళాయి దగ్గర ఆడవాళ్ల వలె జుట్లు జుట్లు పట్టుకొని కొట్లాడుకోవడం, అది కూడా ఎక్కడో పరాయి రాష్ట్రంలో జరగడం ఆంధ్రుల పరువు తీసింది. ఉత్తరాఖండ్ వరద ముప్పును రాష్ట్ర ప్రభుత్వం తక్కువగా అంచనా వేసిందనడం నిజం. మొదటి వారం రోజులూ దాన్ని ఎవరూ పట్టించుకోలేదు. ఎక్కడో పరాయి రాష్ట్రం సమస్యగా మాత్రమే చూశాడు ముఖ్యమంత్రి. చంద్రబాబు అమెరికా నుంచి వచ్చి నేరుగా ఢిల్లీ వెళ్లి, బాధితుల మెప్పు కోసం విమానం ఏర్పాటు చేయడంతో తాము రాజకీయంగా నష్ట పోతున్నామన్న నిజం అర్థం చేసుకొన్నాడు కిరణ్‌కుమార్‌రెడ్డి. నిజానికి ఆయన తలచు కొంటే, ఉత్తరాఖండ్‌లో చిక్కుకపోయిన మూడువేల మంది బాధితులను తరలించడం పెద్ద సమస్య కాదు. ప్రభుత్వం వద్ద హెలికాప్టర్ వుంది. అద్దెకు ఎన్ని కావాలంటే అన్ని దొరుకుతాయి. మన రాష్ట్రానికి చెందిన పారిశ్రామికుల వద్దనే ఆరేడు హెలికాప్టర్లు వున్నాయి. ముఖ్యమంత్రి సహాయ నిధి నుంచి ఎంత కావాలంటే అంత సొమ్ము ఖర్చు పెట్టే స్వేచ్ఛ వుంది. నరేంద్రమోడి డెహ్రాడూన్ వెళ్లి తమ రాష్ట్రం బాధితుల కోసం ఏర్పాట్లు చేసినప్పుడైనా కలమేల్కొని వుంటే పరిస్థితి చెయ్యి దాటేది కాదు. కానీ చంద్రబాబు స్వంత డబ్బుతో విమానం ఏర్పాటు చేసినంత వరకు నిద్ర పోవడంతో రాజకీయంగా చంద్రబాబుదే పై చెయ్యి అయ్యింది. ఆ లోటు పూడ్చుకోవడానికి హడావుడి పడింది ప్రభుత్వం. అప్పుడైనా బాధ్యత తెలిసిన వారెవరినైనా వరద ప్రాంతానికి పంపి వుంటే నిజమైన సహాయం జరిగేది. కానీ వి.హనుమంతరావు వంటి విధూషకుడిని అక్కడకు పంపాడు ముఖ్యమంత్రి. ఆయన తన సహజ వైఖరితో ఉత్తరాఖండ్‌లో మన రాష్ట్రం పరువు తీశాడు. అత్యంత వెకిలిగా ప్రవర్తించి నవ్వులపాలు చేశాడు. వేలాది మంది ప్రాణాలు కోల్పోయి, శవాల ఆచూకీ కూడా దొరకక కుటుంబ సభ్యులు అలమటిస్తున్న పరిస్థితిలో ఈ చవకబారు రాజకీయం చేయడం గర్హనీయం.

జమీన్‌రైతు

## జనవాణి

### విలువలు పతనం!

ప్రతిరోజూ ఒక అక్రమాల పుట్ట పగులుతూ వందల వేల కోట్ల ప్రజాధనం అక్రమార్కులకు స్వాహా అయ్యిందన్న వార్తలు విభ్రాంతిని కలిగిస్తున్నాయి. బొగ్గు గనుల ఉదంతంలో న్యాయశాఖ మంత్రి, పదోన్నతుల పైరవీ కేసులో రైల్వే శాఖ మంత్రి రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుబడినా వారు రాజీనామా చేయనవసరం లేదని ప్రధానమంత్రి, యూపిఏ అధ్యక్షురాలు సోనియా గాంధీ ప్రకటించడం దారుణంగా పతనమైపోయిన నైతిక విలువలకు నిదర్శనం. ప్రపంచీకరణ నేపథ్యంలో సరళీకృత విధానాలను అడ్డం పెట్టుకొని వ్యాపారాలు, రాజకీయ నాయకులు కలిసిపోయి దళారుల సాయంతో వేల కోట్లను అక్రమంగా స్వాహా చేస్తున్నారు. ఈ డబ్బంతా నల్ల ధనం రూపంలో విదేశీ బ్యాంకులకు భద్రంగా చేరిపోతోంది. దీన్ని ఆపే వారెవ్వరు?

పి.వి.రమణయ్య — కావలి

### మాగుంట ఎన్నిక ఆనందకరం!

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటి కార్యనిర్వాహక కమిటీసభ్యులుగా నెల్లూరీయుడు, ఒంగోలు లోక్‌సభ సభ్యులు మాగుంట శ్రీనివాసులురెడ్డి ఎంపిక కావడం హర్షణీయం. స్వర్గీయ మాగుంట సుబ్బరామిరెడ్డి రాజకీయ వారసునిగా శ్రీనివాసులురెడ్డి రాజకీయ రంగప్రవేశం చేసి ఎమ్పీగా సుదీర్ఘకాలం పనిచేసినా వివాద రహితునిగా పేరుగాంచారు. కాంగ్రెస్ పార్టీలో గ్రూపులకు, వర్గాలకు అతీతంగా తన పనేదో తాను చేసుకొంటూ నియోజకవర్గ ప్రజలకు అందుబాటులో ఉంటూ ప్రజాసేవ చేస్తూ సుబ్బరామిరెడ్డి పేరు నిలబెడుతున్న శ్రీనివాసులురెడ్డి ఎంపిక మాగుంట కుటుంబీకుల అభిమానులందరికీ ఆనందకరం.

ఎస్.బి.రావు — కావలి

### భ్రూణ హత్యలు!

దేశంలో పురుషుల సంఖ్యకు తగ్గట్టుగా మహిళల సంఖ్య పెరగడం లేదు. ఆడపిల్ల పుడితే కట్నకానుకల క్రింద లక్షలాది రూపాయలు చెల్లించాల్సి వస్తుందనే భయంతో భ్రూణహత్యలకు పాల్పడుతున్నారు. ప్రభుత్వం ఇకనైనా అత్యాచార నిరోధక చట్టానికి మరింత పదును పెట్టి దానిని కట్టుదిట్టంగా అమలు చేయాల్సిన అవసరం ఉంది. అలా చేయకపోతే అత్యాచారం జరిగిన తర్వాత బాధపడడం కంటే ఆడ పిల్లలను పిండ దశలోనే చిదిమి వేయడం మంచిదనే భావం ప్రజల్లో ఉత్పన్నమయ్యే ప్రమాదం వుంది. అదే జరిగితే దేశ ప్రజలు మరిన్ని అరిష్టాలను ఎదుర్కొనవలసి వస్తుంది. మత్తుపదార్థాలు వినియోగం పెరగడంతో పాటు, నీలి చిత్రాలు అందరికీ అందుబాటులోకి రావడం వల్ల నైతిక విలువలు దిగజారిపోయి మహిళలపై అత్యాచారాలు నానాటికీ పెరిగిపోతున్నాయి. పాశ్చాత్య నాగరికత ఒక ఫ్యాషన్‌గా మారింది. మనిషి ఆలోచనల్లో సెక్స్ అనేది కీలకమైన

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

2-7-1943
పేజీలు : 2 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు
### వస్త్రదానం

తానను భవించి పరులకింత పెట్టగలిగిందే భాగ్యం. తిక్కవరపు రామిరెడ్డి తన ధర్మపత్ని పేరుతో ఉగాదినాడు పేదలకింత కూడు, గుడ్డ బెట్టాడు. అట్లనే పొన్నలూరు సోదరులు తమ తండ్రి మృత సాంవత్సరీకం నాడు కొమరికలో గూడా కొన్ని ప్రాణులకు ఆత్మతృప్తి, అంగతృప్తి జేశారు. అదొక రకం.

తమ ఐశ్వర్యానికి మూల జీవులయిన మైకా గనుల వద్ద పని వారలకు తిండి, వస్త్రం, బోనసుల రూపేణా రామిరెడ్డి గారు ఏటా కొన్ని వేల రూపాయలు ఖర్చు చేస్తున్నాడు. అట్లనే గోగినేని వెంకట సుబ్బయ్య గారు కూడా గత 26వ తేది పరిమిట్లు వగైరా గనుల వద్ద 4వేల రూపాయల ఖర్చుతో వస్త్ర దానం జేసినాడనే శుభవార్త సంతోషకరమైనది. అందరు మైకా వర్తకులు గూడా ఇట్లే సార్థక దాన ధర్మములు ఒనర్చి చరితార్థులగుదురు గాక.

***

నెల్లూరువారే బియ్యం మద్రాసుకు తీసుకుపోయి అక్కడ అప్పగించి అక్కడ గిట్టుబాటు ధరకు యిచ్చే ప్రపోజలు ఎగిరి పోయింది. పాత ధర పెంచలేదు. యిక రైతుల వద్ద తీవ్రంగా రిక్విజేషన్ చేస్తారట.

***

విఆర్ కాలేజిలో వృక్షశాస్త్రం పెడతామని ముందుగానే ప్రకటించారు. చివర వెతుక్కోబోతే దానికి కావలసిన ఉపకరణాలు లేవు. అయినా ఈ దినం మీటింగులో తాళం తెగ్గొడతారట.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

28-6-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### ప్రతి మనిషి వెయ్యి పుస్తకాల రచయిత!

మనిషి రోజులో మాట్లాడే మాటలన్నీ ఒక గంట సేపుంటాయి. జీవితమంతా కలిస్తే మాటల నిడివి రెండు సంవత్సరాల 9 నెలలు ఉంటుంది. జీవిత కాలంలోని మాటలన్నింటినీ వ్రాతలో పెడితే, ఒక్కొక్క పుస్తకం 400 పేజీల వంతున, 1000 పుస్తకాలు తయారవుతాయి. హంగరీలోని మానవ శాస్త్రీయ పరిశోధనా సంస్థ ఒకటి ఈ వివరాలను ప్రకటించింది.

### వాకాడు రజతోత్సవాలు

పేద, అనాథ విద్యార్థుల సేవలో పాతికేళ్లు నిండిన సేవా క్షేత్రాల రజతోత్సవం జూన్ 30; జులై 1, 2 తేదీలలో చిన్న ఆవడి కాంగ్రెస్ స్థాయిలో కోలాహలంగా జరగబోతున్నది. 30వ తేది మంత్రి ఏసి, ఎం.ఆర్. అప్పారావు, స్పీకర్ బి.వి.సుబ్బారెడ్డి; నటులు జగ్గయ్య, రమణారెడ్డి– జులై 1వ తేది మంత్రి బి.వి.గురుమూర్తి, 2వ తేది చిత్ర దర్శకుడు బి.ఎన్.రెడ్డి, తారలు అక్కినేని నాగేశ్వరరావు, నాగయ్య, కృష్ణకుమారి, సంధ్య– ఇక జిల్లాలోని అసెంబ్లీ పార్లమెంటు సభ్యులు, పంచాయితీరాజ్ నాయకులు ఒకరేమిటి పేరున్న ప్రతి ఒక్కరూ వాకాడులో వాలబోతున్నారు.

ఈ రజతోత్సవాల సందర్భంగానే కోట సమితి మేళా; జిల్లా పరిషత్తు సమావేశము, జిల్లా పరిషత్ హైస్కూలు హెడ్మాస్టర్ల సమావేశము గూడా వాకాడులో ఏర్పాటైనవి. జిల్లాలో అపూర్వ సమ్మేళనం, అద్వితీయమైన ఏర్పాట్లు, ఆకర్షణీయమైన రజతోత్సవ అశోక స్థూపము. అందరూ చూచి ఆనందించి ఆశీర్వదించవలసిన సమయము, సంస్థలు.

–విమర్శకుడు

# నెల్లూరు ముచ్చట్లు

## విహంగవీక్షణం

### కొత్త రెవెన్యూ డివిజన్లు!

జిల్లాలో మరో రెండు కొత్త రెవెన్యూ డివిజన్లు నాయుడుపేట, ఆత్మకూరులను 25వతేది రెవెన్యూ మంత్రి రఘువీరారెడ్డి ప్రారంభించారు. ఈ రెండు డివిజన్ల ఏర్పాటుతో జిల్లాలో వీటి సంఖ్య ఐదుకు చేరుకొంది. డివిజన్ల నిర్వహణకు ఒక్కొక్క దానికి మూడు కోట్ల రూపాయల నిధులు కూడా ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి విడుదల చేశారు. కొత్తగా ఏర్పాటుచేసిన నాయుడుపేట డివిజన్‌లో ఆరు మండలాలు, ఆత్మకూరులో పది మండలాలుంటాయి. రెండు కొత్త డివిజన్ల ఏర్పాటు వల్ల నెల్లూరు డివిజన్‌లో 12, కావలిలో 8, గూడూరులో తొమ్మిది మండలాలు వుండేట్లుగా కొత్త లెక్క తేల్చారు.

### కలెక్టర్ బదలీ?

జిల్లా కలెక్టర్ బండాత్మకూరు శ్రీధర్‌రెడ్డి బదలీ కానున్నట్లు విశ్వసనీయంగా తెలిసింది. ఈయన్ను మాజీ హోంమంత్రి సబితా ఇంద్రారెడ్డి తన జిల్లా కలెక్టర్‌గా నియమించుకోను గట్టి ప్రయత్నాలు చేస్తున్నట్లు పోబిడి.

### నెల్లూరుకు సోమశిల నీళ్లేవి?

తాగునీటి అవసరాల కోసం నెల్లూరు నగరానికి సోమశిల ప్రాజెక్ట్ నుంచి ప్రతి వేసవిలో ఒక టిఎంసి నీరు వదలడం రివాజు. కానీ ఈ యేడాది ఆ నీటిని కూడా వదలకుండా మేనేజ్ చేశారు అధికారులు. దీని మూలంగా గతంలో ఎన్నడూలేని విధంగా నగరంలో భూగర్భ జలమట్టాలు బాగా తగ్గిపోయాయి. వీటి లెవలింగ్ కోసమైనా ఈ నీటిని వదలాల్సి వుంది.

### ఎస్పీ వచ్చి రెండేళ్లు!

ఎస్పీగా బివి.రమణకుమార్ పదవీ బాధ్యతలు స్వీకరించి 25వతేదికి రెండేళ్లు పూర్తయ్యింది. ఈ సందర్భంగా ఆయన మీడియాతో మాట్లాడుతూ ఈ రెండేళ్లలో నేరాలు తగ్గుముఖం పట్టడంతోపాటు, పోలీసులు క్యాప్ వంటి సామాజిక సేవా కార్యక్రమాలతో జాతీయ స్థాయిలో పేరు ప్రఖ్యాతులు తెచ్చుకొన్నట్లు చెప్పారు. పంచాయితీ, జడ్పీ, మునిసిపల్ ఎన్నికలను సమర్థవంతంగా నిర్వహించడం తమ ముందున్న కర్తవ్యమని ఎస్పీ ఈ సందర్భంగా చెప్పారు. రమణకుమార్ లాంటి మంచి ఎస్పీలు అరుదుగా వస్తారు. వీరి సేవలు మూడేళ్లు ఉపయోగించుకోవాలి జనం.

### నెలాఖరుకు ఆధార్ పూర్తి!

నెల్లూరు నగరంలో నడుస్తున్న ఆధార్ కేంద్రాలను ఈ నెలాఖరుకు మూసివేస్తామని జిల్లా పౌర సంబంధ శాఖాధికారి ఉమామహేశ్వరరావు చెప్పారు. ప్రస్తుతం నగరంలో 40 కేంద్రాల ద్వారా ఈ ప్రక్రియ నడుస్తోంది. విచిత్రంగా ఇంకా కొన్ని వేల మంది ఆధార్‌కార్డులను తీయించుకోవాల్సి వుంది. కొన్ని వేల మందికి ఈ కార్డులు రావాల్సి వుంది.

### పార్కింగ్ ఎక్కడ చేయాలి!

నెల్లూరులో ట్రాఫిక్, పార్కింగ్ సమస్యలకు కనుచూపు మేరలో పరిష్కారం కానరావడం లేదు. నగరంలో పార్కింగ్ స్థలాలను ఇటు కార్పొరేషన్ అధికారులు కాని అటు ట్రాఫిక్ పోలీసులు గాని గుర్తించలేదు. కాని ఈ మధ్య జనం రోడ్డు ప్రక్కన పెడుతున్న స్కూటర్లు, సైకిళ్లను ట్రాఫిక్ పోలీసులు పట్టుకెళ్లి పోతున్నారు. పార్కింగ్ స్థలాలు ప్రకటించాక ఇలా చేస్తే తప్పు పట్టరు. లేకుంటే పోలీసులను ఇంకా ఈసడించుకొంటారు టౌన్ డిఎస్పీ గారు!

### హిమ్ ముఖ్య ఏజంటు ఇంటిపై పోలీసు దాడి!

ప్రజల డబ్బు 8.50 కోట్ల రూపాయలు దోచుకొని అజ్ఞాతంలోకి వెళ్లిపోయిన హిమ్ మనీస్కీం ఏజంటు నెల్లూరు కపాడిపాళానికి చెందిన విందూరు శ్యామ్ ఇంటిపై 22వతేది సిబిసిఐడి పోలీసులు దాడి చేశారు. ఆయన ఇంటి తాళాలను రెవెన్యూ అధికారుల సమక్షంలో పగుల గొట్టిన డిఎస్పీ దిలీప్ కుమార్ కంప్యూటర్ హార్డ్ డిస్కను స్వాధీనం చేసుకొన్నారు. దీంతో ప్రయోజనముండదు డిఎస్పీ గారు. శ్యాంను పట్టి మీరు మీసాలు తిప్పాలి సార్!

### కూరగాయల మార్కెట్‌లో తెలుగు మహిళలు!

తెలుగు మహిళా నాయకురాలు తాళ్లపాక అనూరాధ నేతృత్వంలో తెలుగు మహిళలు ఎసి సుబ్బారెడ్డి కూరగాయల మార్కెట్‌ను సందర్శించారు. అక్కడ కూరగాయల రేట్లు అడిగి నాలుగైదు రకాల కూరగాయలు కొని ఆకాశాన్ని అంటిన వీటి ధరలను తగ్గించాలని డిమాండ్ చేశారు. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి కూరగాయల ధరలు తగ్గించడంలో విఫలమయ్యారని మెటికలు విరిచారు.

### రంగిడికి రసాభిషేకం!

నెల్లూరీయుల ఆరాధ్య దైవం రంగనాయకులస్వామికి 23వతేది మామిడి పళ్ల రసంతో అభిషేక మహోత్సవాన్ని నిర్వహించారు. జ్యేష్ఠ మాసం పౌర్ణమిని పురస్కరించుకొని ఈ మహోత్సవాన్ని తిలకించేందుకు భక్తులు పెద్ద సంఖ్యలో విచ్చేశారు. స్వామికి సాయంత్రం చందనాలంకారం కూడా చేశారు.

### నెల్లూరీయులు క్షేమం!

చార్‌ధామ్ యాత్రకు నెల్లూరు నుంచి వెళ్లిన యాత్రికులపై దైవం చల్లని చూపు చూసింది. అక్కడ కాలుడి కేళికి వేలాది మంది ప్రాణాలు పోగొట్టుకొన్నా నెల్లూరువాసులంతా ఇప్పటి వరకున్న సమాచారం మేరకు సురక్షితంగా వచ్చేశారు. ఈ మధ్య ఉత్తరకాశీ యాత్రలకు నెల్లూరీయులు పెద్దసంఖ్యలో వెళ్తున్నారు.

### సరస్వతి నిధికి వేమిరెడ్డి విరాళం!

కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి మానస పుత్రిక సరస్వతీ నిధికి ప్రతియేడు తన వంతు విరాళం ఇవ్వడం వదాన్యుడు వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డికి అలవాటు. ఈ యేడాది కూడా రెండు లక్షల రూపాయల విరాళాన్ని తన ప్రతినిధి శేషారెడ్డి ద్వారా జిల్లా కలెక్టర్‌కు అందించారు ప్రభాకర్ రెడ్డి. ప్రభాకర్‌రెడ్డి దానగుణాన్ని జిల్లా కలెక్టర్ ఈ సందర్భంగా ప్రస్తుతించారు.

### అప్పా ఇంజనీర్స్ సత్కారాలు!

సూళ్లూరుపేట నియోజకవర్గ పరిధిలో పదవ తరగతి పరీక్షల్లో ప్రతిభ కనపర్చిన 80 మంది విద్యార్థులకు నెల్లూరు అప్పా ఇంజనీర్స్ సంస్థ అధినేత బిఎన్.రాజు పురస్కారాలు అందించారు. 23వతేది జరిగిన ఈ



పెంచలకోనలోని లక్ష్మీనృసింహస్వామి దేవస్థాన ఛైర్మన్‌గా ప్రమాణ స్వీకారం చేసి రిజిష్టర్‌లో సంతకం చేస్తున్న చెన్ను తిరుపాల్‌రెడ్డి. ప్రక్కన రాపూరు ఏఎంసి ఛైర్మన్ చెన్ను బాలకృష్ణారెడ్డి, డిసిసిబి ఛైర్మన్ మెట్టుకూరు ధనుంజయరెడ్డి.

### పెంచలకోన ఛైర్మన్‌గా చెన్ను తిరుపాల్‌రెడ్డి!

జిల్లాలో ప్రసిద్ధ పుణ్యక్షేత్రం పెంచలకోనలోని పెనుశిల నృసింహస్వామి ఆలయ పాలకవర్గం నూతన అధ్యక్షునిగా చెన్ను తిరుపాల్‌రెడ్డి ఎన్నికయ్యారు. స్వామిభక్తులు, అభిమాన జన సందోహం నడుమ 24వతేది బాధ్యతలు స్వీకరించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ పెంచలకోన దేవస్థానంలో అభివృద్ధి అంటే ఏమిటో చూపిస్తానన్నారు. పెంచలకోనలో అభివృద్ధి పనులు ఇంకా చేయాల్సి వుందని, దూరప్రాంతాల నుంచి వచ్చే భక్తులు సంతోషంగా స్వామిని దర్శించిపోయేలా సౌకర్యాలు కల్పిస్తానన్నారు. స్వామి కళ్యాణోత్సవం సందర్భంగా భక్తులు ఎదుర్కొంటున్న ఇబ్బందులు ఇక లేకుండా చేస్తామన్నారు. ఈ కార్యక్రమంలో డిసిసిబి ఛైర్మన్ మెట్టుకూరి ధనుంజయరెడ్డి, రాపూరు ఏఎంసి ఛైర్మన్ చెన్ను బాలకృష్ణారెడ్డి, ఆలయ కార్యనిర్వహణాధికారి శ్రీనివాసరావు పాల్గొన్నారు.

కార్యక్రమంలో మలిశెట్టి శివప్రసాద్, ఇసనాక హర్షవర్ధన్‌రెడ్డి, నాగిశెట్టి ధర్మయ్య, చిలకా యుగంధర్, జెట్టి వేణుమాధవ్, ఎంఇఒ ఫణీష్, బైరి పార్థసారథిరెడ్డి, అయితా శ్రీధర్, అలవల సురేష్, సోత్రటీస్ తదితరులు పాల్గొన్నారు.

కొరవ 14వ పేజీలో

# నెల్లూరు సుందర ముదనష్టం!



శ్రీనివాస అగ్రహారంలో అనిల్‌కు ఘన స్వాగతం.

పారిశుద్ధ్య పరిస్థితులు మరీ క్షీణించి నెల్లూరు నగరం సుందర ముదనష్టంగా తయారయ్యిందని వైకాపా నగర నియోజకవర్గ సమన్వయకర్త డాక్టర్ పి.అనిల్‌కుమార్ యాదవ్ పేర్కొన్నారు. ప్రజాదీవెనలో భాగంగా 18వ డివిజన్‌లోని శ్రీనివాస అగ్రహారంలో పర్యటించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ నెల్లూరు కార్పొరేషన్‌ను అడ్డు పెట్టుకొని అధికార ప్రజాప్రతినిధులు అభివృద్ధి పేరుతో ప్రజలకు ఉపయోగించవలసిన డబ్బును కొల్లగొడుతున్నారన్నారు. రోడ్లువేసిన చోటే నాసిరకంగా పనులు జరుపుతూ ప్రజాప్రతినిధుల అనుచరులే కాంట్రాక్టర్లుగా మారి ప్రజల సొమ్ము స్వాహా చేస్తున్నారు. ఆనాడు డాక్టర్ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పేద ప్రజల కోసం ఎన్నో సంక్షేమ పథకాలు ప్రవేశపెడితే నేటి కాంగ్రెస్ ప్రభుత్వం సంక్షేమ పథకాలను పేద ప్రజలకు అందకుండా దగా చేస్తుందన్నారు. వైఎస్ మరణం తర్వాత 133 సేవలను ఆరోగ్యశ్రీ నుంచి తొలగించిన ఘనత ప్రస్తుత పాలకులదేనని విమర్శించారు. ఈ కార్యక్రమంలో మాగుంట శ్రీకాంత్‌రెడ్డి, గూడూరు వాసుదేవరెడ్డి, గండవరపు ద్వారకానాథ్‌రెడ్డి, గునపాటి సురేష్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# శ్రీసిటీలో చెన్నై బిజినెస్ స్కూల్!

## ప్రతిష్టాత్మక సంస్థ తరలి వచ్చింది



స్కూల్‌ను ప్రారంభిస్తున్న ప్రొఫెసర్ జి.విశ్వనాధన్, రవి సన్నారెడ్డి.

తడకు సమీపంలోని వాణిజ్య నగరం శ్రీసిటీలో ఏర్పాటైన ప్రతిష్టాకరమైన విద్యాసంస్థ చెన్నై స్కూల్ ఆఫ్ బిజినెస్ ఎక్సలెన్స్‌ను ఐఐటి యూనివర్శిటీ వ్యవస్థాపకులు ప్రొఫెసర్ డాక్టర్ జి.విశ్వనాధన్ జ్యోతి వెలిగించి ప్రారంభించారు. శ్రీసిటీలో మూడు ఎకరాల విస్తీర్ణంలో ఏర్పాటైన చెన్నై బిజినెస్ స్కూల్ జూలై నుంచి పని చేయడం ప్రారంభిస్తుంది. ఈ స్కూల్ ద్వారా ఎఐసిటిఇ అనుమతి పొందిన మార్కెటింగ్, ఫైనాన్స్, హ్యూమన్ రిసోర్స్ వంటి నిర్వాహక అంశాలతో పాటు రిటైల్, టెలికామ్, ఇంటర్నేషనల్ బిజినెస్, మ్యానుఫ్యాక్టరింగ్ వంటి ఉత్పాదక అంశాలపై కూడా బోధనాంశాలు వుండడం ప్రత్యేకతగా పేర్కొనవచ్చు. ఈ సందర్భంగా డాక్టర్ విశ్వనాధన్ మాట్లాడుతూ ఈ విద్యా సంస్థ ఉన్నతశ్రేణి విద్యా బోధనలో దేశ ప్రగతికి తోడ్పడే అత్యుత్తమ యువ పారిశ్రామికవేత్తలను అందించాలని పిలుపునిచ్చారు. విశిష్టఅతిథిగా పాల్గొన్న శేషసాయి మాట్లాడుతూ బిజినెస్ స్కూళ్ల పరంపరలో ప్రత్యేకతను సాధించిన సిఎస్‌బిఇ సంస్థ శ్రీసిటీలో ఏర్పాటు కావడం ఆనందకరమన్నారు. శ్రీసిటీలో మేనేజింగ్ డైరక్టర్ రవి సన్నారెడ్డి మాట్లాడుతూ చెన్నై బిజినెస్ స్కూల్ ఏర్పాటుతో ఈ ప్రాంతంలో సమగ్రాభివృద్ధికి తోడ్పడే అత్యుత్తమ సాంకేతిక విద్య అందుబాటులోకి రాగలదన్న ఆకాంక్షను వ్యక్తం చేశారు.

# వ్యవసాయశాఖ జెడిపై విచారణ!

## చర్యలుంటాయా?

అక్రమాలు, అవకతవకలు, నిధుల దుర్వినియోగం తదితర అంశాలపై ఫిర్యాదులు అందడంతో వ్యవసాయశాఖ కార్యాలయం, ఎస్సీ కార్పొరేషన్‌లపై ఉన్నతాధికారులు విచారణ జరపడం చర్చనీయాంశమయ్యింది. వ్యవసాయశాఖకు సంబంధించి ఆ శాఖ జాయింట్ డైరెక్టర్ సుబ్బారావుపై వచ్చిన ఫిర్యాదులపై ఉన్నతాధికారికి విజయలక్ష్మి ఇటీవల విచారణ జరిపారు. 2012 సంవత్సరంలో ఆగష్టు నెలలో వ్యవసాయశాఖ ఆధ్వర్యంలో విఆర్ కళాశాల మైదానంలో యంత్రలక్ష్మి పేరుతో ప్రదర్శనను ఏర్పాటు చేశారు. ఇందులో స్టాల్స్ ఏర్పాటు చేయడంలో ఔత్సాహికుల వద్ద నుంచి ఐదువేల రూపాయలకు పైగా వ్యవసాయశాఖ జెడి సుబ్బారావు వసూళ్లకు పాల్పడ్డారని, రెండు మూడు రోజులపాటు జరిగిన ఈ ప్రదర్శనకు రైతులు స్వల్పసంఖ్యలో హాజరైనా అధికారులు దొంగ లెక్కలు చూపించి 1.50 లక్షల రూపాయల నిధులు స్వాహా చేశారని వ్యవసాయశాఖ ఉన్నతాధికారులకు ఫిర్యాదులు అందాయి. దీనిపై సీనియర్ అధికారిణి విజయలక్ష్మి నగరానికి చేరుకొని వ్యవసాయ శాఖ జెడి కార్యాలయంలో ఫైళ్లను పరిశీలించడంతోపాటు విచారణ జరిపారు. అలాగే తాత్కాలిక ఉద్యోగుల నియామకాలకు సంబంధించి అవకతవకలు జరిగాయని వచ్చిన ఫిర్యాదులపైన ఎస్సీ కార్పొరేషన్ ఎండి కార్యాలయంలో ఆ శాఖ ఉన్నతాధికారి బాబన్న విచారణ చేపట్టారు. ఎన్ఎంఆర్‌లు, తాత్కాలిక ఉద్యోగుల నియామకాలను ప్రభుత్వ నిబంధనలకు విరుద్ధంగా జరిపినట్లు ఫిర్యాదులు అందడంతో ఈ విచారణ జరిపినట్లు సమాచారం. విచారణలు, నివేదికలు, చర్యల మాట ఎలా వున్నా రెండుశాఖలపై అందిన ఫిర్యాదులపై రాజధాని నుంచి అధికారులు వచ్చి విచారించడం చర్చనీయాంశమయ్యింది.

# దొంతాలిలో శ్రీధర్‌రెడ్డికి బ్రహ్మరథం!

## ప్రతి కార్యకర్తకు అండగా ఉంటానని ప్రతిన



దొంతాలిలో కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి.

నెల్లూరు రూరల్ మండలం దొంతాలి గ్రామంలో బాసం కృష్ణమ నాయుడు ఆధ్వర్యంలో పెద్దఎత్తున ప్రజలు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో చేరారు. ఈ సందర్భంగా గ్రామంలో ఏర్పాటు చేసిన బహిరంగ సభకు పార్టీ రూరల్ నియోజకవర్గ సమన్వయకర్త కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి హాజరయ్యారు. ఆయనకు ప్రజలు పొలిమేర్ల నుంచి ఘనస్వాగతం పలికి మేళతాళాల మధ్య సభావేదిక వద్దకు తీసుకెళ్లారు. ఈ సందర్భంగా శ్రీధర్ రెడ్డి మాట్లాడుతూ బాసం కృష్ణం నాయుడు నాయకత్వంలో దొంతాలి ప్రజలు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో చేరడం సంతోషంగా వుందన్నారు. అందరి చేరికతో దొంతాలి గ్రామంలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ పూర్తిస్థాయిలో పటిష్టంగా తయారయ్యిందన్నారు. కాంగ్రెస్ ప్రభుత్వం ప్రజా వ్యతిరేక విధానాలతో కరెంట్ ఛార్జీల దోపిడీతో, సంక్షేమ పథకాల కోతలతో ప్రజలు విసిగివేసారి పోయారని విమర్శించారు. ప్రతిపక్ష పార్టీగా తెలుగుదేశం పార్టీ ప్రభుత్వ వ్యతిరేక విధానాలపై పోరాటం చేయడంతో విఫలమయ్యి పరపతి పోగొట్టుకొన్నాదన్నారు. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో చేరే ప్రతి కార్యకర్త, నాయకుడికి తాను అండగా వుంటానని శ్రీధర్‌రెడ్డి భరోసా యిచ్చారు. ఈ కార్యక్రమంలో మల్లినేని నాగరాజునాయుడు, పొప్పాల భాస్కర్ నాయుడు, సూరిశెట్టి అనిల్ కుమార్, రుద్రపాటి సుధాకర్ నాయుడు, ఎన్.ఏడుకొండలు, బాలు వెంకట రమణయ్య, ఎన్.ప్రదీప్, కె.పాపయ్య, బి.కిరణ్, సిహెచ్‌ప్రసాద్, దొంతాలి మాజీ సర్పంచ్ రమణయ్య తదితరులు పాల్గొన్నారు.

# విద్యార్థుల భవితవ్యంపై ఆందోళన!

గుర్తింపులేని పాఠశాలలు, కళాశాలలపై చర్యలు చేపట్టాలన్నది చాలాకాలంగా విద్యార్థి సంఘాలు, తల్లిదండ్రులు కోరుతున్న వ్యవహారం. ఇప్పటివరకు అదిగో ఇదిగో అంటూ నానుస్తూ వస్తున్న అధికారులు ఎట్టకేలకు నిద్రమత్తు, లంచాల మత్తు వదిలించుకొని రంగంలోకి దిగారు. ప్రభుత్వ అనుమతి లేకుండా నిర్వహిస్తున్న కళాశాలలపై చర్యలు తీసుకొంటున్నారు. గూడూరులోని నారాయణ కళాశాల, ఇతర ఒకటి రెండు కళాశాలలపై చర్యలు ఆరంభించడం పట్ల హర్షం వ్యక్తం చేస్తున్నప్పటికీ పూర్తిస్థాయిలో ఈ చర్యలు వుండడం లేదని, కంటి

## గుర్తింపులేని స్కూళ్లపై దాడులు

తుడుపు చర్యగా వుంటున్నాయన్న విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. గత కొన్నేళ్లుగా జిల్లాలో పాఠశాలలు, కళాశాలలకు సంబంధించి పలు అక్రమాలు, అవకతవకలు చోటుచేసుకొంటున్నాయని ఆరోపణలు వస్తున్నాయి. ఒక పాఠశాలకు ప్రభుత్వ అనుమతి తీసుకొని పలు సెంటర్లలో పాఠశాలలు నిర్వహించడం, విద్యార్థులందరినీ అనుమతి వున్న పాఠశాల తరఫున పరీక్ష వ్రాయించడం లాంటి అవకతవకలు చాలానే జరుగుతున్నాయి. మరికొన్ని స్కూళ్ల రికార్డుల్లో ఒక పేరుతో వుంటే బయట ఏర్పాటు చేసే బోర్డులు వేరే పేరుతో వుంటున్నాయి. పరీక్షల సమయంలో మాత్రం వాటి పేరుతో రికార్డుల్లో నమోదవుతున్నాయి. ఇంటర్మీడియట్ కళాశాలల విషయంలోనూ ఇలాంటివే చోటు చేసుకొంటున్నాయనే అపవాదు వుంది. ఈ పరిస్థితుల్లో విద్యాశాఖ గుర్తింపులేని పాఠశాలల విషయంలో చర్యలు తీసుకోవడంలో మీనమేషాలు లెక్కిస్తున్నా, కళాశాలలపై ఆర్ఐఓ చర్యలు చేపట్టడం కలకలం రేపింది. ఇందులో రాజకీయ కారణాలు వున్నాయన్న ఆరోపణలు వ్యక్తం అవుతున్నాయి. ఈ నేపథ్యంలో అధికారులు గుర్తింపులేని విద్యాసంస్థల్లో చేరిన విద్యార్థులు నష్టపోకుండా చూడాలని విద్యార్థుల తల్లిదండ్రులు కోరుకొంటున్నారు.

# రంగడి ఛైర్మన్ గిరిపై రభస!

## ఎవరికి దక్కేనో?

తల్పగిరి రంగనాథస్వామి దేవస్థానం పాలక మండలి ఛైర్మన్ నియామకం వివాదాస్పదంగా మారింది. ప్రముఖ క్షేత్రమైన ఈ ఆలయ ఛైర్మన్‌గా పదవీ బాధ్యతలు చేపట్టేవారు సమాజంలో పేరుప్రఖ్యాతులు వుండడంతోపాటు నడవడిక బాగుండాలని భక్తులు కోరుకొంటుంటారు. కానీ రాజకీయాలు చోటు చేసుకోవడంతో ఎవరంటేవారు ఛైర్మన్‌లు అవుతున్నారు. గత కొద్దికాలంగా ఖాళీగా వున్న ఈ పోస్టుకు మొదట్లో ఆనం వివేకానందరెడ్డి కుమారుడుని ఛైర్మన్‌ను చేయాలనుకొన్నారు. అయితే నగర ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్ కృష్ణారెడ్డి తన మనిషిగా సరయు ఆటో యజమాని, చిరంజీవి సేవా సమితి గౌరవాధ్యక్షుడిగా వున్న రాజ్‌కుమార్‌ను ఛైర్మన్‌ను చేయాలని గట్టి పట్టు పడ్తున్నాడు. ఈ విషయంలో ఎమ్మెల్యేలు ఇరువురి మధ్య కొంతకాలంగా వివాదం నలుగుతోంది. ఈ పరిస్థితుల్లో పలు కేసులు ఎదుర్కొంటున్న రాజ్‌కుమార్‌ను రంగనాథస్వామి ఆలయం ఛైర్మన్‌గా నియమించడం ఏమిటని పలువురు వ్యతిరేకిస్తున్నారు. ఇదిలా వుండగా ఆనం అనుచరుడు, సంతపేటకు చెందిన యువజన కాంగ్రెస్ నేత కుటుంబంలో ఆర్థిక లావాదేవీల విషయమై వివాదం నెలకొనింది. ఛైర్మన్ గిరిని ఆశిస్తున్న వ్యక్తికి యువనేత కుటుంబం అప్పు ఇచ్చి వుండడం, ఈ బాకీ విషయమై తండ్రి, కొడుకుల మధ్య ఏర్పడిన వివాదాన్ని చక్కదిద్దేందుకు సంతపేటకు చెందిన బిజెపి మాజీ కార్పొరేటర్ రంగంలోకి దిగడం, అతనికి ఛైర్మన్ పదవి రేసులో వున్న వ్యక్తికి మధ్య వివాదం జరిగి మాజీ కార్పొరేటర్ అవమానం ఎదుర్కొన్నాడట. దీంతో రాజ్‌కుమార్‌ను రంగనాథస్వామి గుడి ఛైర్మన్‌ను ఎలా చేస్తారని వస్తున్న వివాదానికి ఆజ్యం పోయడంతో ఇది కాస్తా ఆనం వివేకానందరెడ్డికి అవకాశంగా మారింది. దీన్ని సాకుగా చూపి ఆయనకు కాకుండా మరొక వ్యక్తికి ఛైర్మన్ పదవి ఇవ్వాలని వివేకా ప్రయత్నిస్తుండడం, ఎలాగైనాసరే తాను చెప్పిన వ్యక్తికే ఛైర్మన్ పదవి ఇవ్వాలని ముంగమూరు పట్టుబట్టి వున్నారు. ఈ వివాదం ఏ మలుపు తిరుగుతుందో వేచి చూడాలి.

# వెంగమాంబ ఉత్సవాలకు రండి!



## మాదాల జానకిరాం పిలుపు

కోరిన కోర్కెలు ఈడేర్చే నర్రవాడ వెంగమాంబ బ్రహ్మోత్సవాలకు అధికసంఖ్యలో భక్తులు పాల్గొని జయప్రదం చేయాలని మాజీమంత్రి, వెంగమాంబ పరమభక్తుడు మాదాల జానకిరామ్ పిలుపునిచ్చారు. మెట్ట ప్రాంతవాసుల ఆరాధ్య దేవత అయిన వెంగమాంబ తల్లికి ప్రతి ఏటా బ్రహ్మోత్సవాలను వైభవంగా నిర్వహిస్తున్న విషయం తెలిసిందే. ఆలయ ధర్మకర్తల మండలి ఈ విషయంలో ప్రత్యేకశ్రద్ధ చూపుతోంది. వెంగమాంబ ఆలయానికి సంబంధించి నూతన ధర్మకర్తల మండలి జూన్ 20న ప్రమాణస్వీకారం చేసింది. ఈ కార్యక్రమానికి జానకిరామ్ ముఖ్య అతిథిగా పాల్గొని కొత్తగా ఎంపికైన కమిటీకి శుభాకాంక్షలు తెలపడంతోపాటు ఘనంగా సన్మానించాడు. ఈ సందర్భంగా ఆయన బ్రహ్మోత్సవాల ఏర్పాట్లపై పలు సూచనలు, సలహాలు అందించారు. జూన్ 20వ తేది నుంచి జూలై 3వ తేదీ వరకు జరిగే వెంగమాంబ బ్రహ్మోత్సవాలకు దేశం నలుమూలల వుండే మెట్టప్రాంత వాసులు తరలి వచ్చి తల్లిని దర్శించుకొని ఆశీస్సులు అందుకోవాలని కోరారు. ఈ ప్రమాణ స్వీకార కార్యక్రమంలో నర్రవాడ మాజీ సర్పంచ్ మాదాల తిమ్మయ్య, ఆలయ ఉపప్రధానార్చకులు బెల్లంకొండ పెద భద్రయ్య తదితరులు పాల్గొన్నారు.

# జెఎన్‌టియూ పరిధిలోనికి ఎన్‌బికెఆర్ ఇంజనీరింగ్ కాలేజి!



ఎన్‌బికెఆర్ ఇంజినీరింగ్ కాలేజి పరిపాలనా భవనం.

## అనుమతించిన కమిటీ

ఇంజనీరింగ్ విద్యలో ప్రఖ్యాతిగాంచిన విద్యానగర్‌లో గల ఎన్‌బికెఆర్ ఇంజనీరింగ్ కళాశాలను అనంతపురంలోగల జెఎన్‌టియూఏ అనుబంధ కళాశాలగా తీసుకొనేందుకు సాంకేతిక అంశాలపై అధ్యయన బృందం పరిశీలన జరిపింది. సాంకేతికంగా మరింత వున్నత విద్యాబోధనచేసే విషయమై ఎన్‌బికెఆర్‌ను జెఎన్‌టియూఏ అనుబంధ కళాశాలగా మార్చాలని గత కొంతకాలంగా విద్యార్థులు, వారి తల్లిదండ్రులు కోరుతున్నారు. దీనిపై స్పందించిన కళాశాల కరస్పాండెంట్ ఎన్.రామ్‌కుమార్, ఛైర్మన్ గోపాలరెడ్డితోపాటు కమిటీ వారి కోరికకు సమ్మతిస్తూ జెఎన్‌టియూ అనుబంధ కళాశాలగా వుండేందుకు ఒప్పుకొంది. విక్రమ సింహపురి యూనివర్శిటీ నుంచి దీనికి అనుమతి పొంది అక్కడి ఉన్నతాధికారులతో సంప్రదింపులు జరిపారు. ఎట్టకేలకు సాంకేతిక నిపుణుల అధ్యయన బృందం అంగీకరించడంతోపాటు విద్యానగర్ వచ్చి పరిశీలన జరిపారు. కళాశాల వసతి సౌకర్యాలను, విద్యాబోధనను సమీక్షించారు. అధ్యయన బృందం ఛైర్మన్ డాక్టర్ విజయకుమార్‌రెడ్డి, డాక్టర్ కృష్ణయ్య, డాక్టర్ గిరిప్రసాద్, డాక్టర్ చెన్నారెడ్డి, డాక్టర్ చంద్రమోహన్ ఈఈఈ, సివిల్, మెకానికల్, ఈసిఈ విభాగాలను పరిశీలించారు.

# వెంగమాంబ సేవకు మదన్‌మోహన్!



దుత్తలూరు మండలం నర్రవాడగ్రామంలో వెలసి వున్న మెట్టప్రాంత వాసుల ఆరాధ్యదేవత శ్రీ వెంగమాంబ దేవస్థానం కార్యవర్గ సభ్యులుగా ఆ తల్లి పేరుతో వెంగమాంబ కన్‌స్ట్రక్షన్స్ కంపెనీ స్థాపించి నిర్వహిస్తున్న బోయిళ్ల మదన్‌మోహన్ బాధ్యతలు చేపట్టారు. వింజమూరు మండలం గొట్టిగుండాల గ్రామానికి చెందిన మదన్ మోహన్ ఇంజనీరింగ్ విద్యనభ్యసించారు. 1992 నుంచి 2008దాకా ప్రభుత్వ ఉద్యోగం చేసిన ఆయన అనంతరం ఆ ఉద్యోగానికి రాజీనామా చేసి ఆరాధ్య దేవతైన వెంగమాంబ పేరు మీద కన్‌స్ట్రక్షన్స్ రంగంలోకి దిగాడు. కంపెనీ ఏర్పాటుచేసిన కొద్దికాలంలోనే పలు అపార్టుమెంట్‌లు నిర్మించి పేరు ప్రఖ్యాతులు గడించాడు. వ్యాపార రంగంలో ఉన్నతికి చేరుకొన్న ఆయన వెంగమాంబ ఆలయ ధర్మకర్తల మండలి సభ్యునిగా ఇటీవలే ప్రమాణస్వీకారం చేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ఆ తల్లికి సేవ చేసే భాగ్యం లభించడం అదృష్టంగా భావిస్తున్నట్లు తెలిపారు. తమ ఇలవేల్పయిన వెంగమాంబ ఆలయాన్ని మరింత అభివృద్ధి చేసేందుకు మాజీ మంత్రి మాదాల జానకిరామ్, ఇతర సభ్యులతో కలసి శాయశక్తులా కృషి చేస్తానన్నారు. మదన్ జానకిరామ్ దగ్గరి బంధువు కావడం విశేషంగా చెప్పొచ్చు.



# ఆధునిక సౌకర్యాలతో ఆదిత్య ఎలిగ్జర్!



ఆదిత్య ఎలిగ్జర్ బ్రోచర్‌ను విడుదల చేస్తున్న సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి, మాజీ శాసనసభ్యులు సి.వి.శేషారెడ్డి, జిల్లా ప్రణాళికా మండలి మాజీ సభ్యుడు వై.వి.రామిరెడ్డి, ఆదిత్య ఎలిగ్జర్ అధినేత బాలకృష్ణారెడ్డి.

## జిల్లాలో తొలి రియల్ ఎస్టేట్ వెంచర్

ఆహ్లాదకరమైన వాతావరణంలో అత్యాధునిక వసతి సౌకర్యాల నడుమ ఇళ్లు నిర్మించుకోవాలనే వారి కలలను నిజం చేసేలా ఏర్పాటైంది ఆదిత్య ఎలిగ్జర్. రియల్ ఎస్టేట్ రంగంలో పేరుగాంచి బెంగుళూరు నగరంలో పలు వెంచర్లు వేసి ప్రజల నమ్మకాన్ని చూరగొన్న ఎస్కాన్ డెవలపర్స్ దీనిని అభివృద్ధి చేశారు. కృష్ణపట్నం పోర్టు రోడ్డు మార్గంలో జాతీయ రహదారిని ఆనుకొని నిర్మితమవుతున్న ఈ వెంచర్ నిర్వాహకులు చెప్పినట్లు ఆహ్లాదకర వాతావరణం తొణికిసలాడడంతోపాటు జిల్లాలో ఇంతవరకు ఎవరూ చేపట్టని విధంగా అత్యాధునికంగా గేటెడ్ కమ్యూనిటి టౌన్‌షిప్ ఇది. 65 ఎకరాల సువిశాల విస్తీర్ణంలో ఏర్పరచిన ప్లాట్లలో అందమైన ఆర్చి స్వాగతం పలుకుతుంది. భక్తి భావం తొణికిసలాడే విధంగా సాయిబాబా ఆలయం, పిల్లలు పెద్దలు సేద తీరేందుకు పచ్చని పార్కు, ఆంజనేయ స్వామి విగ్రహం, ఆట స్థలం, టెన్నిస్‌కోర్టు, హెల్త్‌క్లబ్, స్విమ్మింగ్‌పూల్, మసాజ్ సెంటర్, బ్యూటీపార్లర్, జిమ్ మహిళలకు, పురుషులకు ప్రత్యేకంగా ఏర్పాటవుతున్నాయి. రెస్టారెంట్ లాంటి సౌకర్యాలతోపాటు క్లబ్‌హౌస్ ఆదిత్య ఎలిగ్జర్ ప్రత్యేకత. ఎటు చూసినా విశాలమైన రోడ్లతో అంతర్జాతీయ స్థాయి నాణ్యతా ప్రమాణాలతో ఏర్పాటు చేస్తున్నట్లు నిర్వాహకుడు బాలకృష్ణారెడ్డి తెలిపారు. దీనికి సంబంధించిన బ్రోచర్‌ను సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి ఇటీవల విడుదల చేసి ఆధునిక వసతి సౌకర్యాలతో ఏర్పాటు చేస్తున్న సంస్థ నిర్వహకులను అభినందించారు.



నెల్లూరుజిల్లా ముదిరాజ్ మహాసభ జిల్లా సమావేశంలో మాట్లాడుతున్న సంఘం అధ్యక్షుడు కనకట్ల రఘురామ్.

# ఆర్టీసి బస్సులను తగ్గించారు!

## ఇబ్బంది పడుతున్న విద్యార్థులు

ఆర్టీసి అధికారుల అనాలోచిత నిర్ణయాల ఫలితంగా విద్యార్థులు తీవ్ర ఇబ్బందులు పడాల్సిన పరిస్థితులు తలెత్తుతున్నాయి గూడూరు రూరల్ మండలంలో. మండల పరిధిలోని వివిధ ప్రాంతాల నుంచి పాఠశాలలకు, కళాశాలలకు వెళ్లే విద్యార్థులు బస్సులపైనే ఆధారపడుతుంటారు. బస్సు సర్వీసులు రోజుకు ఎనిమిది ట్రిప్పులు తిరుగుతుండేవి. ఇటీవల కొంతకాలంగా బస్సు సర్వీసులను కుదించడంతో కేవలం నాలుగు ట్రిప్పులే తిరుగుతున్నాయి. అదీ ముఖ్యమైన వేళలకు రాకపోవడంతో విద్యార్థులు తీవ్ర అసౌకర్యానికి గురౌతున్నారు. మిట్టాత్మకూరు, విందూరు, పగడాలపల్లి, సంతదాసుపల్లి గ్రామాల నుంచి కళాశాలలకు, పాఠశాలలకు వెళ్లే విద్యార్థులు విధిలేని పరిస్థితుల్లో ఆటోలను ఆశ్రయించాల్సి వస్తోంది. దీని అవకాశంగా చేసుకొని ఆటో వాళ్లు ఛార్జీలను విపరీతంగా పెంచేశారు. 15 నుంచి 20 రూపాయలు తీసుకొంటున్న ఆటోలు 30 నుంచి 40 రూపాయలు చేయడంతో ఆర్థిక భారం మోయలేక, బస్సు లేక విద్యార్థులు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. వీరిని దృష్టిలో వుంచుకొనైనా ఆర్టీసి అధికారులు బస్సులను యథావిధిగా నడపాలని వివిధ గ్రామాల ప్రజలు కోరుకొంటున్నారు.

● కావలిలో

# డాక్టర్ ప్రభాకర్ నాయుడికి ఘన సన్మానం!



కావలి పట్టణంలో పేదల డాక్టర్‌గా గుర్తింపుపొందిన డాక్టర్ ప్రభాకర్‌నాయుడుకు ఘనసన్మానం జరిగింది. 75వసంతాలు పూర్తి చేసుకొన్న సందర్భంగా ఆయనకు పురప్రముఖులు పౌర సన్మానం జరిపారు. స్థానిక టిటిడి కళ్యాణమండపంలో జరిగిన ఈ సన్మాన కార్యక్రమానికి ఎంపి మేకపాటి రాజమోహన్‌రెడ్డి, స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు, వైఎస్ఆర్‌సిపి కావలి నియోజకవర్గ సమన్వయకర్త రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి తదితరులు పాల్గొని ప్రభాకర్‌నాయుడు చేస్తున్న వైద్యసేవలను కొనియాడారు. హాస్పిటల్ స్థాపించి పేదలకు చక్కని వైద్యం చేస్తూ పేదల డాక్టర్‌గా పేరు సంపాదించుకొన్నారని మేకపాటి రాజమోహన్‌రెడ్డి ప్రశంసించారు. డాక్టర్ ప్రభాకర్‌నాయుడు అధికంగా శస్త్ర చికిత్సలు చేసి అరుదైన ఘనత సాధించారని, ఎందరికో ప్రాణదానం చేశారని ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు కొనియాడారు. మున్సిపల్ ఛైర్మన్‌గా పని చేసిన కాలంలో ఎన్నో సేవా కార్యక్రమాలు చేపట్టారని రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి గుర్తు చేశారు. మరింతగా వైద్యసేవలు అందించి పేద ప్రజలకు అండగా నిలవాలని పలువురు వక్తలు అభిలాషించారు. అనంతరం గజమాల, శాలువాతో ఘనంగా సన్మానించారు. సన్మానం అందుకొన్న డాక్టర్ ప్రభాకర్‌నాయుడు అందరికీ కృతజ్ఞతలు తెలిపారు. ఈ సన్మాన కార్యక్రమంలో కాంగ్రెస్ నేత గ్రంధి యానాదిశెట్టి, దామిశెట్టి శ్రీనివాసులనాయుడు, చింతాల వెంకట్రావ్, ప్రసన్నాంజనేయులు, కనమర్లపూడి నారాయణ, వెంకటేశ్వర్లు, ఆర్‌డిఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి తదితర అధికార, అనధికారులు పాల్గొన్నారు.

# తగ్గిన వేరుశనగ సాగు!

## గిట్టుబాటు ధర లేకపోవడమే కారణం.

ముత్తుకూరు మండలంలో వేరుశనగ పంట సాగుకు రైతుల్లో ఆసక్తి సన్నగిల్లింది. గత సీజన్‌లో కష్టించి పంట సాగు చేసినప్పటికి అనుకొన్న రీతిలో దిగుబడులు రాకపోవడం, గిట్టుబాటు ధర లభించకపోవడమే ఈ నిరాశకు కారణం. భూగర్భ జలాలు అడుగంటడం మరో కారణంగా రైతులు చెప్తున్నారు. క్రిందటి సీజన్‌లో మండలంలోని నారికేళ్లపల్లి, పిడతాపోలూరు, పంటపాళెం, ముత్తుకూరు, ఈపూరు తదితర ప్రాంతాలలో అధికంగా రైతులు వేరుశనగ పంట సాగు చేశారు. పంట చేతికొచ్చే దశలో కుళ్లిపోయి తీవ్రంగా నష్టపోయారు. 2500 రూపాయలు పలికిన బస్తా ధర 1400 రూపాయలకు పడిపోయింది. దీంతో రైతులు ఆలోచనలో పడ్డారు. ఫలితంగా ఈ సీజన్‌లో పంటసాగు విస్తీర్ణం తగ్గిపోయింది. నిన్నమొన్నటి వరకు రైతులు ఫిల్టర్ పాయింట్లు, దొరువు నీటిపై ఆధారపడి పంటల సాగు చేపడుతున్నారు. ఇటీవల కాలంలో వివిధ ఫ్యాక్టరీలు ఏర్పడి నీటిని పెద్ద ఎత్తున వినియోగిస్తుండడం, భూగర్భ జలాలు అడుగంటడంతో రైతులపై తీవ్ర ప్రభావాన్ని చూపుతోంది.

● బాల క్రీడాకారులు

# జాతీయస్థాయికి ఎదగాలి!

## జిల్లా క్రీడాభివృద్ధి అధికారి ఆకాంక్ష.



బాల క్రీడాకారులు ఉన్నతంగా రాణించాలని జాతీయ స్థాయికి ఎదిగి దేశానికి పేరు ప్రఖ్యాతులు తీసుకరావాలని జిల్లా క్రీడాభివృద్ధి అధికారి యతిరాజులు పిలుపునిచ్చారు. కావలి విశ్వోదయ బాలుర ఉన్నత పాఠశాల ఆవరణలో జరిగిన వేసవి క్రీడా శిక్షణ ముగింపు కార్యక్రమంలో పాల్గొన్న ఆయన విద్యార్థులకు పలు సూచనలు, సలహాలు అందించారు. విద్యార్థులు చదువుతోపాటు క్రీడల్లోనూ రాణించాలని అలాంటి వారికి మంచి అవకాశాలున్నాయని తెలిపారు. స్పోర్ట్ హాస్టళ్లలో చేర్చుకొని ప్రభుత్వమే చదువు చెప్పించి క్రీడల్లో శిక్షణనిస్తుందని వివరించారు. పాఠశాల కరస్పాండెంట్ విజయశేఖర్‌రెడ్డి మాట్లాడుతూ విశ్వోదయ విద్యాసంస్థల్లో మొదటి నుంచి క్రీడలకు పెద్దపీట వేస్తున్నారని తెలిపారు. ఇక్కడి నుంచి జాతీయ, అంతర్జాతీయ స్థాయికి ఎంతో మంది క్రీడాకారులు ఎదిగారన్నారు. అనంతరం విద్యార్థులకు ప్రశంసాపత్రాలు అందజేశారు. ఈ కార్యక్రమంలో పిడి మాల్యాద్రి, జిల్లా వ్యాయామ ఉపాధ్యాయ సంఘం కార్యదర్శి కృష్ణారెడ్డి, బాల్‌బ్యాడ్మింటన్ సంఘం కార్యదర్శి విజయశేఖర్‌రెడ్డి, శారద, రాజ్యలక్ష్మి తదితరులు పాల్గొన్నారు.

# నెల్లూరు పార్లమెంట్ స్థానం నుంచి పోటీకి రెడీ!

## కావలిలో బీద మస్తాన్‌రావు



తెలుగుదేశం పార్టీ అధినేత నారా చంద్రబాబు నాయుడు ఆదేశిస్తే నెల్లూరు పార్లమెంటుకు పోటీ చేసేందుకు సిద్ధమని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు ప్రకటించారు. పార్టీ ఆదేశాలే శిరోధార్యమన్నారు. పట్టణంలోని తెలుగుదేశంపార్టీ కార్యాలయంలో ఇటీవల నియోజకవర్గ స్థాయి బిసి సెల్ కార్యవర్గ సమావేశం జరిగింది. టిడిపి బిసి సెల్ జిల్లా అధ్యక్షుడు అన్నం దయాకర్ గౌడ్ అధ్యక్షతన జరిగిన ఈ సమావేశంలో పాల్గొన్న బీద మస్తాన్‌రావు పై విధంగా వ్యాఖ్యానించారు. తెలుగుదేశం పార్టీని అధికారంలోకి తేవడానికి బిసిలంతా చురుకైన పాత్ర పోషించాలన్నారు. సామాన్య కార్యకర్తలను ఎమ్మెల్యేలు, మంత్రులను చేసిన ఘనత తెలుగుదేశంపార్టీకే దక్కుతుందన్నారు. జూలై రెండవవారంలో చంద్రబాబునాయుడు చేపట్టే బస్సు యాత్రను విజయవంతం చేయాలని కోరారు.

# ప్రభుత్వం విద్యావ్యవస్థను దెబ్బతీస్తోంది!

ప్రభుత్వం విద్యను వ్యాపారంగా మార్చి పారేసిందని సిపిఐ రాష్ట్రకార్యవర్గ సభ్యుడు, విశాలాంధ్ర ఎడిటర్ ఈడ్పుగంటి నాగేశ్వరరావు విమర్శించారు. ప్రాథమిక విద్యను బలోపేతం చేస్తానంటూనే విద్యను కార్పొరేట్ సంస్థల చేతుల్లోకి పంపే కుట్ర పన్నుతోందన్నారు. ఇటీవల కావలి పట్టణంలో గల క్లాత్‌మర్చంట్స్ అసోసియేషన్ కళ్యాణ మండపంలో ఏఐఎస్ఎఫ్ రాజకీయ, వైజ్ఞానిక శిక్షణా తరగతులు జరిగాయి. ఈ కార్యక్రమంలో ముఖ్య అతిధిగా పాల్గొన్న ఆయన మాట్లాడుతూ ప్రస్తుత పరిస్థితుల్లో విద్య వ్యాపారంగా మారిందన్నారు. విద్యార్థుల తల్లిదండ్రులు దృక్పథంలోను మార్పురావాలన్నారు. అఖిలభారత విద్యార్థిసంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి బయ్యన్న మాట్లాడుతూ ప్రభుత్వం విద్యార్థుల గొంతునొక్కుతున్నాదని, విద్యా విధానాలపై ప్రశ్నిస్తే తప్పుడు కేసులు బనాయిస్తున్నాదన్నారు. విద్యాహక్కు చట్టం అమలు కావడం లేదని, దీనిపై విద్యార్థులు ఉద్యమించాల్సిన అవసరం ఎంతైనా వుందన్నారు. ఈ కార్యక్రమంలో ఏఐఎస్ఎఫ్ జిల్లా నాయకులు అంకయ్య, నాగేంద్ర తదితరులు పాల్గొన్నారు.



# సౌత్‌ఆములూరులో మారిన రాజకీయం!



## కాకాణికి ఘనస్వాగతం

తెలుగుదేశం పార్టీకి పెట్టని కోటగా వుంటూ సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డికి ప్రతి ఎన్నికల్లో మెజార్టీ సాధించి పెడుతున్న సౌత్‌ఆములూరు గ్రామంలో ఆ పార్టీకి బీటలు వారుతున్న పరిస్థితి ఏర్పడుతోంది. ఈ విషయం ఇటీవల వైకాపా సర్వేపల్లి నియోజకవర్గ సమన్వయకర్త కాకాణి గోవర్ధన్‌రెడ్డి పంచాయితీలో చేపట్టిన ప్రజాదీవెన యాత్రలో బయటపడింది. ఆలస్యంగా, పొద్దుపోయిన తర్వాత గ్రామంలోకి వచ్చిన కాకాణికి మహిళలు పెద్ద సంఖ్యలో ఎదురేగి ఘనస్వాగతం పలికారు. గ్రామదేవత ఆములూరమ్మ దేవస్థానం నుంచి స్వాగత సత్కారాలు ఏర్పాటు చేశారు. ఇంటింటికి ఓపిగ్గా తిరిగిన కాకాణి రాజకీయ విమర్శలు చేయకుండా సంయమనం పాటించాడు. స్థానిక ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్ రెడ్డి సౌత్ ఆములూరును పెద్దగా పట్టించుకోలేదు. కేవలం గుడ్లూరు వెంకయ్యానాయుడుని తోటపల్లి గూడూరు సహకార బ్యాంక్ ఉపాధ్యక్ష పదవి కట్టబెట్టి చేతులు దులుపుకొన్నారు. ఈ పరిస్థితుల్లో కాకాణి గోవర్ధన్‌రెడ్డి ఈ గ్రామంపై కన్నేశారు. తన వెంట కమ్మవర్గం తమ ప్రతినిధిగా చెప్పుకొనే కొమ్మి లక్ష్మయ్యనాయుడును వెంటపెట్టుకొని వచ్చి రాజకీయ చతురత ప్రదర్శించారు. కాకాణి ప్రజాదీవెన యాత్రను విజయవంతం చేయడంలో గ్రామానికి చెందిన మద్దిన వెంకట సుబ్బానాయుడు, కిషోర్‌నాయుడు, గాలి వెంకటేశ్వర్లునాయుడు, రంగినేని కిషోర్, గార్ల ప్రసాద్, మల్లికార్జున్‌లు కష్టపడ్డారు.



నెల్లూరు సెంట్‌జాన్స్ స్కూల్ పూర్వ విద్యార్థి ప్రస్తుతం అమెరికాలో వుంటున్న వి.లక్ష్మీప్రత్యూష స్కూల్‌లో ప్రతిభావంతులైన పిల్లలకు పంపిణీ చేయమని పంపిన మొత్తాన్ని అందుకొంటున్న ఓల్డ్ స్టూడెంట్స్ అసోసియేషన్ నాయకులు సివి.ప్రసాద్, జె.చంద్రశేఖర్.

# ప్రాజెక్ట్‌ల పేరుతో ప్రజలకు అన్యాయం!

## ముసునూరువారిపాళెంలో అఖిలపక్షం

ప్రాజెక్టుల ఏర్పాటు పేరుతో రైతుల నోట్లో మట్టికొడితే ఊరుకోమని అఖిలపక్షం హెచ్చరించింది. ముత్తుకూరు మండలం ముసునూరివారి పాళెంలో వివిధ ప్రాజెక్టుల ఏర్పాటు పేరుతో రైతులకు జరుగుతున్న అన్యాయం తదితర అంశాలపై తెలుగుదేశం, సిపిఎం, సిపిఐలు అఖిలపక్షంగా ఏర్పడి సమావేశం నిర్వహించాయి. ఈ సందర్భంగా తెలుగుదేశంపార్టీ మండల నేత బాబురెడ్డి మాట్లాడుతూ భూసేకరణ సమయంలో ఫ్యాక్టరీ యాజమాన్యాలు, అధికారులు చేసే వాగ్దానాలు ఆతర్వాత అమలు కావడం లేదని, జీవనోపాధి కోల్పోయిన వారి బాగోగులు ఎవరూ పట్టించుకోవడం లేదని ఆరోపించారు. జెన్‌కో ప్రాజెక్టుకు సంబంధించి భూసేకరణ సమయంలో ఇచ్చిన వాగ్దానాల్లో ఒక్కటి అమలు కాకపోవడం ఇందుకొక ఉదాహరణన్నారు. ప్రాజెక్టులను ఆహ్వానిస్తామని, అట్లని ప్రజలకు ఇబ్బంది కల్గిస్తే సహించమన్నారు. పర్యావరణానికి హాని కల్గించే ఏ నిర్మాణాలైనా వ్యతిరేకిస్తామని, అలాంటి వాటికి వ్యతిరేకంగా పోరాడుతామని తెలిపారు. ప్రజావ్యతిరేక విధానాలను అవలంభించే అధికారులను విధుల నుంచి తొలగించాలని, నేషనల్ గ్రీన్ ట్రిబ్యునల్ బూడిద చెరువు విషయమై ఇచ్చిన స్టే ఆధారంగా ఇకపై పనులు జరగకుండా చూడాలని అధికారులను కోరారు. బూడిదగుంట నిర్మాణం జరిగితే ఆరుగ్రామాల మధ్య ఎనిమిదివేల మంది ప్రజలు ఇబ్బంది పడతారని అలాంటి నిర్మాణాలకు వ్యతిరేకంగా పోరాటం ఉధృతం చేస్తామని హెచ్చరించారు. అధికారపార్టీ నేతలు జెన్‌కో ప్రాజెక్టుల్లో కాంట్రాక్టర్ల అవతారం ఎత్తి తమ స్వార్థం కోసం ప్రజలను ఇబ్బందులకు గురిచేస్తున్నారని సిపిఎం నేత రాధయ్య, సిపిఐ నాయకులు నరహరి విమర్శించారు. ఈ సమావేశంలో నరసింహానాయుడు, కాంతారావు, వెంకయ్య, రమేష్ తదితరులు పాల్గొన్నారు.

● స్థానిక

# సమరానికి సిద్ధం కావాలి!

## పార్టీ శ్రేణులకు సోమిరెడ్డి పిలుపు



త్వరలో జరుగనున్న స్థానిక సంస్థల ఎన్నికలకు తెలుగుదేశం పార్టీ కార్యకర్తలు సిద్ధం కావాలని, ప్రజలను చైతన్యపరచి ఈ ఎన్నికలలో తమ సత్తా చాటాలని తెలుగుదేశం పార్టీ పొలిట్‌బ్యూరోసభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి పిలుపునిచ్చారు. ముత్తుకూరు మండలం పిడతాపోలూరు గ్రామంలో టిడిపి కార్యకర్తల సమావేశం జరిగింది. ఈ సమావేశంలో ముఖ్య అతిథిగా పాల్గొన్న సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి కార్యకర్తలకు దిశానిర్దేశం చేశారు. అధికార కాంగ్రెస్ ప్రభుత్వం అవినీతిలో కూరుకపోయిందన్నారు. తల్లి కాంగ్రెస్, పిల్ల కాంగ్రెస్ కుమ్మక్కై చంద్రబాబునాయుడు మీద విమర్శలు చేయడం సిగ్గుచేటన్నారు. తొమ్మిదేళ్ల తెలుగుదేశం పార్టీ పాలనలో రాష్ట్రం ఎంతగానో అభివృద్ధి చెందిందని, నేటి కాంగ్రెస్ పాలనలోనే రాష్ట్రం కుంభకోణాల మయమైందన్నారు. ప్రజలకు ఇబ్బంది కలుగజేసే పరిశ్రమల ఏర్పాటును జిల్లాలో అడ్డుకొంటామన్నారు. ఆరు గ్రామాల ప్రజలకు ఇబ్బంది కల్గించే బూడిద చెరువు ఏర్పాటు చేయవద్దని ప్రజలు కోరుతున్నా స్థానిక శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి పరిశ్రమల యాజమాన్యాలకు కొమ్ముకాస్తూ పోరాటం చేసే వారిని ఇబ్బందుల పాలుజేస్తున్నారని ఆరోపించారు. వీటన్నింటిని దృష్టిలో పెట్టుకొని కార్యకర్తలు సైనికుల్లా పని చేయాలని పార్టీకి విజయం సాధించి పెట్టాలని పిలుపునిచ్చారు. ఈ సమావేశంలో పార్టీ మండల నేతలు రామ్మోహన్‌రెడ్డి, విశ్వమోహన్‌రెడ్డి, గోపాల్ రెడ్డి, కోదండరామయ్య, లచ్చారెడ్డి, కాంతారావు, వెంకయ్య, రత్నం తదితరులు పాల్గొన్నారు.

# మంత్రి ఆనంపై విష్ణు వర్గం గుర్రు!

## విష్ణు పట్టు సాధించేనా?



ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి వ్యవహార శైలిపై మాజీ శాసనసభ్యుడు విష్ణువర్ధన్‌రెడ్డి గుర్రుగా వున్న విషయం తెలిసిందే. కాంగ్రెస్‌పార్టీకి చెందిన వారికి కాకుండా తెలుగుదేశానికి చెందిన ఎమ్మెల్యేకు, కార్యకర్తలకు మంత్రి పెద్దపీట వేస్తున్నారని పలు సందర్భాలలో అసంతృప్తి వెళ్లగక్కారు. ముఖ్యమంత్రి కిరణ్‌ను, జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి పితాని సత్యనారాయణను, పిసిసి అధ్యక్షుడు బొత్స సత్యనారాయణలను కలసిన విష్ణువర్ధన్‌రెడ్డి కార్యక్రమాలకు తమను పిలవకుండా ప్రతిపక్ష ఎమ్మెల్యేను పిలిపించుకొని ఆయనతో చెట్టాపట్టాల్ వేసుకొని తిరుగుతున్నారని చెప్పారు. కావలి నియోజకవర్గ ఇన్‌ఛార్జ్‌గా వున్న విష్ణుకు తెలియకుండానే మండల కమిటీ నియామకం జరిగినట్లు బొత్సా దృష్టికి తెచ్చారట. దీనిపై తగిన న్యాయం చేస్తామని హామీ ఇవ్వడంతో విష్ణు వర్గ నేతలు వెనుదిరిగారు. అయితే ఇటీవల జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి పితాని సత్యనారాయణ ఇచ్చిన విందుకు విష్ణువర్ధన్‌రెడ్డి మంత్రి ఆనం వెళ్లిన తర్వాత వెళ్లడం చర్చనీయాంశమయ్యింది.

# వాగ్దానాలను నిలుపుకోలేని బల్లి దుర్గాప్రసాద్!

## ప్రజల్లో సన్నగిల్లుతున్న అభిమానం



గూడూరు శాసనసభ్యుడిగా వున్న బల్లి దుర్గాప్రసాద్ పలు సందర్భాలలో అధికారులు తనకు సహకరించడం లేదని, ప్రతిపక్ష పార్టీకి చెందిన ఎమ్మెల్యేను కావడంతో పక్షపాతం చూపుతున్నారని, అధికారపార్టీ నేతల పెత్తనం అధికమయ్యిందని వ్యాఖ్యానించాడు. ఎన్నిసార్లు ఆయన ఆక్రోశపడినా, ఆగ్రహించినా, అడిగినా పాపం ఆయన చేసిన సూచనలు పట్టించుకోకపోవడంతో ప్రజలు అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. ఇటీవల ఆయన ఎమ్మెల్యేగా నాలుగేళ్ల పదవీకాలం పూర్తి చేసుకొన్న సందర్భంగా మాట్లాడుతూ ప్రజలకు ఇచ్చిన హామీలు నెరవేర్చేందుకు శక్తి వంచన లేకుండా కృషి చేస్తున్నానన్నారు. ఈ నాలుగేళ్ల కాలంలో కోట్ల రూపాయలు వెచ్చించి పలు అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టినట్లు వివరించారు. అయితే ఎమ్మెల్యే హామీలపై నియోజకవర్గ ప్రజలు తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. ఎమ్మెల్యేగా పోటీచేసి ఓడిపోయిన అధికారపార్టీ నేతలు చేస్తున్న అభివృద్ధి ముందు బల్లి చేస్తున్న అభివృద్ధి ఏపాటిదని ప్రశ్నిస్తున్నారు. పలు గ్రామాల్లో పర్యటించిన సందర్భంలో తాము ఇచ్చిన అర్జీలు ఇంతవరకు పరిష్కారం కాకపోవడంపైన ప్రజలు నిలదీస్తున్నారు. తీరప్రాంత గ్రామాలలో మంచినీటి సౌకర్యం, మౌలిక వసతుల ఏర్పాటు విషయంలో శ్రద్ధ చూపడం లేదని, ఆక్రమణలపైన తగిన విధంగా వ్యవహరించడం లేదని ప్రజలు వ్యాఖ్యానిస్తున్నారు. అలాగే చిల్లకూరు మండలం పారిచెర్లపాళెం చప్టా వద్ద వంతెన నిర్మాణం, తిప్ప గుంటపాళెం వద్ద వంతెన నిర్మాణాలపైన ఇచ్చిన హామీలు నిలుపుకోలేకపోవడం పట్ల అసంతృప్తి వ్యక్తమవుతోంది. ఈ సమస్యలపై ఏవిధంగా స్పందిస్తాడో ఎమ్మెల్యే?

# చార్‌ధామ్‌లో రుద్ర ప్రతాపం!

ప్రకృతి ప్రకోపం ఎంత భీభత్సంగా వుంటుందో రుచి చూపించింది కేదార్‌నాథ్. కైలాసనాథుని దర్శించి, పాప విమోచనంతో ముక్తి పొందుదామని వెళ్లిన వేలాది యాత్రికులకు రుద్ర ప్రతాపం అంటే ఏమిటో అనుభవానికి వచ్చింది. మనకు ప్రకృతి విలయాలు కొత్త కాదు. ఎన్నో తుఫాన్లు, సునామీలు, వరద విధ్వంసాలు చూస్తూనే వుంటాము. కానీ ఉత్తరాఖండ్ హిమాలయ పర్వత శ్రేణులలో గత రెండు వారాలుగా ప్రకృతి చేస్తున్న కరాళ నృత్యం మాత్రం మొత్తం మానవ జాతికే ఒక హెచ్చరికగా భావించాలి.

హిమాలయాల వయస్సు కొన్ని లక్షల సంవత్సరాలు. ఆఫ్రికా ఖండం 7 కోట్ల సంవత్సరాలని అంచనా. ఈ సుదీర్ఘ కాలంలో ఆ హిమవన్నగాలు ఎన్ని ఉత్పాతాలు చూసి వుంటాయో లెక్క పెట్టలేము. మరొక ఏడు కోట్ల సంవత్సరాల పాటు కూడా అవి అట్లనే సమున్నతంగా నిలిచే వుంటాయి. ప్రకృతి ప్రసాదించిన ఆ విలువ కట్టలేని సంపదను ఆర్థిక అభివృద్ధి పేరిట దోచుకోవాలన్న మానవ దురాశ ఇంత ఉత్పాతానికి కారణమైందన్నది నిజం.

## గాంధీ సరస్సుతో మొదలు

కేదార్‌నాథ్ ఉత్పాతం మొదలైంది మందిరానికి ఆరు కిలోమీటర్ల ఎగువన కేదార్‌కుండ్ అనే కొండ శిఖరంపై వుండే చోరాబరితల్ అనే సరస్సు నుంచి. ఈ సరస్సును గాంధీ సరస్సు అని పిలుస్తారు. గాంధీ చితాభస్మాన్ని ఇక్కడ కలపడం వల్ల దానికా పేరు వచ్చింది. కేదార్‌నాథ్ మందిరం ఎగువ ప్రాంతం స్వర్గారోహణ మార్గమని హిందువుల నమ్మిక. అందువల్లనే ఆ సరస్సులో గాంధీ చితాభస్మం కలిపారు. భారీ వానలకు ఆ సరస్సు నిండి గట్లు తెగాయి. దానితో సరస్సులోని నీరు మొత్తం ఒక్కసారిగా బయటకు తోసుకొని వచ్చాయి. ఆ ధాటికి సరస్సు పైభాగాన వున్న మంచు బండలు కదలబారాయి. మంచు బండలు, సరస్సు నీరు కలగలిసి కొండ దిగువకు దుమకడంతో ఒక్కసారిగా కేదార్‌నాథ్ మందిరం పైకి వరద విరుచుకపడింది. ఆ నీరంతా మందాకినీ నదిలో కలిసి, అసలే భారీ వానలకు ఉప్పొంగుతున్న నది ప్రవాహాన్ని ఒక్కసారిగా రెండింతలు పెంచాయి.

## మహా శివుడే మందిరాన్ని కాపాడాడా?

ఆరు కిలోమీటర్ల ఎత్తు నుంచి అంత ఉధృతంగా వరద విరుచుకపడితే, దిగువన వున్న కేదార్‌నాథ్ మందిరం క్షణాలలో మాయమై పోవాలి. ఆనవాళ్లు లేకుండా కొట్టుకపోవాలి. కానీ విచిత్రంగా మందిరం ఎట్లున్నది అట్లనే వుంది. అందుకు కారణం – ఎగువ నుంచి జారిపడిన బండరాళ్లు మందిరానికి కొంత దూరంలో ప్రహరీ గోడ వలె నిలిచి పోవడం. ప్రవాహం మొత్తం ఆ బండల గోడ ముందుకు వెళ్లకుండా, అనుకొని ప్రవహించి దిగువకు జారి పోవడం. అక్కడి పరిస్థితి చూస్తే ఆ పరమ శివుడే తన మందిరాన్ని రక్షించుకొన్నాడా అన్నంత ఆశ్చర్యం కల్గుతుంది.

## హిమాలయాలు మట్టి కొండలు

మందాకిని నది, కేదార్‌నాథ్‌కు అరవై కిలోమీటర్ల దూరంవరకు ఒంటరిగా ప్రయాణించి, అలకనంద నదిలో సంగమిస్తుంది. ఆ నదిలో కూడా వరద ఉధృతి వుండడంతో రెండూ కలిసి మహోగ్ర రూపంలో హిమాలయ పర్వత శ్రేణుల నుంచి క్రిందకు దూకాయి. హిమాలయాలు ఒకరకంగా చెప్పాలంటే మట్టి కొండలు. 2500 కిలోమీటర్ల పొడవున విస్తరించి వుండే ఆ పర్వత శ్రేణులలో చాలా చోట్ల మట్టి తప్ప ఒక్కరాతి ముక్క కూడా కన్పించదు. అగర్తల, మిజోరాం వంటి ఈశాన్య రాష్ట్రాలతోపాటు, నేపాల్‌లో కూడా దీన్ని గమనించ వచ్చు. మిగతా భూభాగంలో కూడా బండలు, మట్టి కలిసి వుంటాయి. పూర్తిగా రాతి రూపంలో ఒక్క మౌంట్ ఎవరెస్ట్ వంటి కొన్ని చోట్ల మాత్రమే కన్పిస్తాయి హిమాలయాలు. ఈ భౌగోళిక స్వరూపం – మందాకినీ నది వరదను ఒక మహా విపత్తుగా మలచాయి. వరద ఉధృతికి కొండలలోని మట్టి కరిగి, జారిపోయింది. దానితో ఆ మట్టిని ఆసరా చేసుకొని నిలబడి వుండిన బండరాళ్లు కదలిపోయాయి. తుపాకీ నుంచి తూటాలు వెలువడినంత వేగంతో దూసుకొని వచ్చి క్రింద పడ్డాయి.

అన్ని ఘాట్ రోడ్లలో వలెనే కేదార్‌నాథ్ వెళ్లే దారిలో కూడా కొండ అంచు తొలిచి రోడ్డు వేశారు. ఒక పక్క చూస్తే పై అంచు కనపడని పర్వత శిఖ

కొరవ 16వ పేజీలో

## ఇప్పుడు జరిగేవి విహారయాత్రలు మాత్రమే!



విహార యాత్ర పోకడకు నిదర్శనం బద్రీనాథ్ గుడి ముందు ప్రేమికుల జంట.

హిమాలయ సానువులకు రుషికేష్ పాద భాగమైతే కేదార్‌నాథ్, బద్రీనాథ్‌లు శిఖర భాగాలు. కేదార్‌నాథ్ ఎత్తు 11760 అడుగులు. బద్రీనాథ్ ఎత్తు 11250 అడుగులు. అక్కడ శివుడు, ఇక్కడ విష్ణువు పూజలందుకొంటూ వుంటారు. ఈ రెండు మందిరాలను నిర్మింప చేసింది ఆదిశంకరాచార్యుల వారే. ఇవి టిబెట్ వైపున చైనా సరిహద్దులకు సమీపంలో వుంటాయి. అందువల్ల మన సైనికులూ కాపలా వుంటారు. ఏప్రెల్ నెలాఖరు నుంచి అక్టోబరు వరకు మాత్రమే అక్కడకు వెళ్లడానికి వీలౌతుంది. తతిమా ఆరు నెలలపాటు సైనికులు మాత్రమే వుంటారు. తతిమా వారందరినీ క్రిందకు పంపి వేస్తారు. కేదార్‌నాథ్ మందిరంలోని శివలింగాన్ని సైతం ప్రధాన పూజారి అక్కడ నుంచి ఉఖిమఠ్ అనే ఆశ్రమానికి తరలించి, ఆరునెలలపాటు పూజలు నిర్వహిస్తాడు.

అత్యంత క్లిష్టమైన మార్గంలో, కొండలు ఎక్కుతూ దిగుతూ, వాగులు వంకలు దాటుతూ వెళ్లవలసిన పరిస్థితి కాబట్టి గతంలో శివసాయుజ్యం పొందాలన్న తమకం కల్గిన భక్తులు మాత్రమే తీర్థయాత్ర చేసేవారు. తిరిగి వస్తామన్న నమ్మకం ఏ కోశానా లేకుండా ప్రయాణం చేసేవారు. కానీ సైనికులు తమ రాకపోకల కోసం చైనా సరిహద్దు వరకు రోడ్డు వేసుకోవడంతో సాధారణ భక్తుల రాకపోకలు పెరిగిపోయాయి. రుషికేష్ నుంచి చిన్న చిన్న బస్సులు, కార్లు, జీపుల ద్వారా ప్రతి ఏటా కొన్ని లక్షల మంది చార్‌ధామ్ యాత్ర చేస్తున్నారు. వీరిలో భక్తి కంటే విహార యాత్ర సంకల్పమే ఎక్కువ. వేసవి సెలవులలో సరదాగా గడపడానికి వెళ్లే వారే ఎక్కువ.

## ఏ దారీ లేకున్నా వేల ఏళ్లుగా తీర్థయాత్రలు!



మంచుతో కప్పబడి వున్న కేదార్‌నాథ్ ఆలయం.

కేదార్‌నాథ్‌కు కానీ, బదరీనాథ్‌కు కానీ రోడ్డు వసతి ఏర్పడింది పాతిక ముప్పై ఏళ్ల క్రితం మాత్రమే. కానీ ఆ రెండు ప్రసిద్ధ పుణ్య క్షేత్రాలకు హిందు భక్తుల తీర్థయాత్ర కొన్ని వేల సంవత్సరాలుగా నిరంతరాయంగా నడుస్తూనే వుంది. రుషికేష్ నుంచి వేలాది మంది సాధువులు ప్రతి ఏటా కొండలుకోనేల మధ్య దారులు వెతుక్కొంటూ, ప్రాణాన్ని సైతం లెక్క చేయకుండా ఆ పుణ్య స్థలాలకు వెళ్లి ప్రార్థనలు చేయడం ఒక ఆనవాయితీ. ఇప్పటికీ కూడా మార్చి నెల మొదటి నుంచే ఎంతో మంది సాధువులు, వివిధ ఆశ్రమాలకు చెందిన గురువులు కాలి నడకనే వెళ్తుంటారక్కడకు. పాత కాలంలో కేదార్‌నాథ్‌కు బయలుదేరిన వారు తిరిగి రావడం చాలా అరుదుగా మాత్రమే జరిగేదట. మన దక్షిణాదిలో కాశీకి పోవడమంటే కాటికి పోవడం అనే సామెత వున్నట్లే ఉత్తరాదిలో కేదార్‌నాథ్ మీద ఎన్నో సామెతలున్నాయి. ఆ హిమాలయ సానువులలో నివశించే స్థానిక గిరిజన జాతి ప్రజలు కేదార్‌నాథ్‌కు వెళ్లే సాధువులకు దారి చూపించడం, తిండి, నీళ్లు అందించడం ఒక ఆనవాయితీ. ఇప్పటికీ ఆ ఆనవాయితీ కొనసాగుతూనే వుంది.

## పాండవుల పునాది - శంకరుని నిర్మాణం!

ప్రపంచం నోట నానుతున్న కేదార్‌నాథ్ మందిరానికి సుదీర్ఘమైన చరిత్ర వుంది. మహాభారతంలో దీని ప్రస్తావన వుంది. పాండవులు స్వర్గారోహణకు వెళ్లే క్రమంలో ఈ ప్రదేశానికి వచ్చారని, భీమసేనుడు తన స్వహస్తాలతో ఇక్కడ శివలింగాన్ని ప్రతిష్ఠించాడని, దానికి పూజలు చేసిన తర్వాతే వారు కైలాసం దారి వెతుక్కొంటూ వెళ్లారని పురాణ కథనం. ఆ తర్వాత కొన్ని వేల సంవత్సరాలకు, క్రీస్తు శకం 820 సంవత్సరంలో ఆదిశంకరాచార్యులు ఇక్కడ విగ్రహ ప్రతిష్ఠ చేశారని చారిత్రక ఆధారాలు చెప్తున్నాయి. అంటే ఇప్పటి మందిరం వయస్సు 1300 సంవత్సరాలన్న మాట. శంకరాచార్యులు చివరగా నెలకొల్పిన జ్యోతిర్లింగం ఇది. అన్నేళ్లపాటు ఎన్నో భూకంపాలు, వరదలు, ఉత్పాతాలను తట్టుకొని ఆ మందిరం నిలబడడం చాలా గొప్ప విషయం. గఢ్వాల్ హిమాలయ శ్రేణి మొత్తాన్ని కదలబారించిన ఇప్పటి ప్రకృతి విలయం సైతం ఆ మందిరంలోని చిన్న రాయిని కూడా కదిలించలేకపోయింది. దాన్నిబట్టే ఆదిశంకరాచార్యుల వారి హస్త మహిమను అంచనా వేసుకోవచ్చు.

ఈ మందిరం ప్రత్యేకత – ఇక్కడ శివుడు లింగ రూపంలో కాక త్రికోణంలో దర్శనం ఇవ్వడం. ఆ విగ్రహం చెక్కిన రాయి వయస్సు ఇంత వరకు ఎవరూ నిర్ధారించలేకపోయారు. కొన్ని వేల సంవత్సరాల వయస్సుంది దానికి. తమ పాపాలు హరించమని శివుడిని వేడుకోవడానికి పాండవులు ఇక్కడకు వచ్చారని, వారికి మహాశివుడు కళ్లు చెదిరే జ్యోతి రూపంలో దర్శనం ఇచ్చాడని ప్రతీతి. మహాశివుడు పాండవులను పరీక్షించడానికి దున్నపోతు రూపంలో కన్పించాడట. భీముడు నిజం తెలుకోలేక గదతో కొట్టడంతో ఆ పసుపతి తన ముఖం కన్పించకుండా మంచులో దాచుకొన్నాడట. అయితే భీముడు వదలకుండా తోక పట్టి గట్టిగా లాగడంతో ఆ దున్నపోతు తల వేరై ఎగిరిపడిందని, తతిమా శరీరం మాత్రమే మిగిలిందని పురాణ కథ. అట్లా ఎగిరిపడిన దున్నపోతు ముఖం నేపాల్‌లోని భక్తాపూర్ అనే ప్రాంతంలో పడిందట. అక్కడ దున్నపోతు ముఖం రూపంలో వున్న శివుడిని ధోళేశ్వర్ మహారాజ్ పేరిట పూజిస్తారు.

కేదార్‌నాథ్ మందిరం గర్భ గృహంలో త్రికోణ ఆకృతిలో జ్యోతిర్లింగం వుంటుంది. దానికి ముందున్న గదిలో పంచ పాండవులు, శ్రీకృష్ణుడు, నంది విగ్రహం, శివుడి పరిచారకుడైన వీరభద్రుడి విగ్రహం వుంటాయి. దానికి ముందు వుండే గదిలో ద్రౌపది విగ్రహం వుంటుంది. కేదార్‌నాథ్‌కు పాండవులకు వున్న సంబంధానికి ఈ విగ్రహాలు ఒక ప్రతీక.

# IIT-JEE... JEE - ADVANCED గా మారినా... కఠినమైన పోటీ పరీక్షా విధానంలోనూ

## ఓపెన్ కేటగిరిలో ఆలిండియా 1, 2 ర్యాంకులతో పాటు టాప్ '10 లోపు 4' ర్యాంకులు, '100 లోపు 37' ర్యాంకులు

ఆలిండియాలో ఒక్క ఆంధ్రప్రదేశ్‌కే...
మరే రాష్ట్రానికీ లేవు...
మరే విద్యాసంస్థకీ లేవు...

# ఒక్క శ్రీచైతన్య నారాయణ కే

1 Rank – All India Open Category – P. Sai Sandeep Reddy, H.T. No. 6006170

2 Rank – All India Open Category – A. Ravi Chandra, H.T.No. 6015069

7 Rank – All India Open Category – M. Viswa Virinchi, H.T. No. 6001059

8 Rank – All India Open Category – S. Leena Madhuri, H.T. No. 6027289

**దేశంలో మరే ఇతర విద్యాసంస్థ సాధించని అత్యధిక ఆలిండియా ఓపెన్ కేటగిరీ ర్యాంకులు 100 లోపు 37 తో సంచలనం సృష్టించిన శ్రీచైతన్య నారాయణ**

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 16 S. Venkata Sailesh | 17 M. Kuladeep | 18 M.d. Owais Khan | 21 M. Karthik Dixit | 26 V. Kranthi | 34 FARAN AHMAD | 35 K SUMA | 36 Katuri Sai Kiran | 38 Siddaradh Bulia | 41 K. VARSHITH | 42 T.V. Sai Dheeraj |
| 44 K. Venkata Aditya | 45 E. Nithish Reddy | 47 C. Venkateswara Rao | 49 P. Venkata Aditya | 50 Sumit Kumar | 53 K. NAGA RAJU | 57 A Raghava Sarma | 63 NVSSK Chaitanya | 69 [illegible] | 70 [illegible] | 73 M. Venkat Kalyan |
| 75 K. NIKHIL | 76 L RAHUL | 77 K. SUMANTH | 78 Animesh | 81 Piyush Arya | 85 Akshit Trehan | 86 G. SRUJAN RAJ | 87 Amit Malva | 89 N.S. Sai Ritwik | 94 V.N.Prabhu Charan | 97 AKASH GARG |

**ఆలిండియా ఆల్ కేటగిరీలో మొత్తం ర్యాంకులు**

# 3149

**శ్రీచైతన్య నారాయణ విద్యార్థుల ఓపెన్ కేటగిరి ర్యాంకుల విశ్లేషణ**

| ర్యాంకులు | విద్యార్థుల సంఖ్య |
|---|---|
| 10 లోపు | 4 |
| 20 లోపు | 7 |
| 50 లోపు | 20 |
| 100 లోపు | 37 |

* ఇప్పటివరకు అందిన సమాచారం ప్రకారం

**ఆలిండియా ఆల్ కేటగిరీలో టాప్ 10 లోపు ర్యాంకులు**

| Rank | Name |
|---|---|
| 1 | S. Leena Madhuri |
| 2 | Narupalli Kuladeep |
| 3 | Katuri Sai Kiran |
| 4 | Siddaradh Bulia |
| 5 | K. VARSHITH |
| 6 | C. Venkateswara Rao |
| 7 | Sumit Kumar |
| 8 | M. Venkat Kalyan |
| 9 | L RAHUL |
| 10 | Amit Malva |

**చైనా బ్యాచ్ CO IPL ప్రోగ్రామ్ అడ్మిషన్లకై సంప్రదించండి:**

| సైఫాబాద్ లక్ష్మీకపూల్ (డిస్కవర్) హైదరాబాద్ | కావూరి హిల్స్ మాదాపూర్ హైదరాబాద్ | మయూరి భవన్ గురునానక్ కాలనీ, విజయవాడ | వేదవ్యాస్ భవన్ ఆసీల్‌మెట్ట, వైజాగ్ | వేదవ్యాస్ భవన్ రాఘవేంద్రనగర్ తిరుపతి | ధనలక్ష్మీపురం నెల్లూరు |
|---|---|---|---|---|---|
| 9247088401<br>9912343960 | 9248080813<br>9000309548 | 9246495924<br>9059889550 | 9059889550<br>9912347686 | 9912378646<br>9908638027 | 9000310264 |

లాంగ్ టర్మ్ అడ్మిషన్లకై మీ దగ్గరలోని అన్ని శ్రీచైతన్య, నారాయణ బ్రాంచిలను సంప్రదించగలరు.

# శ్రీచైతన్య నారాయణ IIT అకాడమి

# వారఫలాలు

*తేది 29-6-2013 నుండి 5-7-2013 వరకు మేషంలో కేతువు; వృషభంలో కుజుడు 4తేది వరకు తదుపరి మిథునంలో; మిథునంలో రవి, బుధ, గురులు; కర్కాటకంలో శుక్రుడు; తులలో శని, రాహువులు; కుంభ, మీన, మేష, వృషభాలలో చంద్రుడు సంచరిస్తారు.*



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగ రంగాలలో శ్రమ, ఒత్తిడిలున్నా చాకచక్యంగా వ్యవహరించగలరు. నిరుద్యోగులకు కలిసొచ్చేకాలం. అయితే కొన్ని పనుల విషయంలో అటుఇటుగా ఫలితాలుంటాయి. బంధు మిత్రులతో సమస్యలు ఎదుర్కొంటారు. ఉద్యోగులకు బదలీల ఊహాగానాలుంటాయి. వ్యవసాయదారులకు అనుకూలతలు సిద్ధిస్తాయి. కళా, క్రీడాకారులకు ఉత్సాహమున్నా అనవసర ఒత్తిడి వుంటుంది.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

ప్రయాణాలలో శ్రద్ధ వహించాలి. స్పెక్యులేషన్ కలసిరాదు. విద్యార్థులకు సంతృప్తినిచ్చేకాలం. బంధుమిత్రుల రాకపోకలకు అధికమౌతాయి. చేపట్టిన పనులు గట్టి ప్రయత్నం మీద కార్యలాభాలుంటాయి. వృత్తి, వ్యాపార, ఇతర రంగాలలోని వారికి ఆదాయం బాగుంటుంది. పొదుపు చేయడానికి ప్రయత్నిస్తారు. ఉద్యోగులకు అనుకూల బదలీలు, ప్రమోషన్లుంటాయి.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు 1,2,3 పా

ప్రతార్జిత ఆదాయం పొందగలరు. నూతన వ్యాపార విషయమై వాయిదా వేయడం మంచిది. విద్యార్థులు రెండు, మూడు విధాలుగా తమ తదుపరి విద్యకై ప్రయత్నించడం మంచిది. తరచుగా శారీరక, మానసిక అలసట వుంటుంది. కుటుంబంలో అనుకూలతలు సాధిస్తారు. వృత్తి, వ్యాపార, ఇతర రంగాల వారు ముఖ్య ఆదాయ వనరులపై ముందుగానే జాగ్రత్తలు పాటించాలి.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆదాయంలో హెచ్చుతగ్గులుంటాయి. ఆటుపోట్లు ఏర్పడుట, ఉద్యోగులు అవినీతి పనులకు దూరంగా వుండుట మంచిది. ఇంటాబయట సమస్యలు, అనవసర సమస్యలలో తలదూర్చుట అపార్థాలకు హేతువవుతుంది. స్థానచలనాలుంటాయి. స్వయంకృతాపరాధంతో ఆర్థికంగా నష్టాన్ని చవిచూస్తారు. వ్యవసాయదారుల భవిష్యత్తు బాగుంటుంది.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

సోదరీ, సోదరులతో జాగ్రత్తగా వ్యవహరించడం మేలు. అన్ని వృత్తుల వారికి అవకాశాలు సిద్ధిస్తాయి. రాబోవు కాలంలో వృత్తి, ఉద్యోగులు కర్తవ్యాలకు ప్రాధాన్యతనివ్వాలి. నిరుద్యోగ సమస్యలు తీరుతాయి. నూతన వ్యాపారాది కార్యక్రమాలకు ఇది మంచి అవకాశం. పాత బకాయిలు వసూలు కాగలవు. ఉద్యోగులకు అనుకూల బదలీలు, విద్యార్థులు నూతన కళాశాలలో చేరగలరు.



**కన్య**
ఉత్తర 2,3,4పా. హస్త, చిత్త 1, 2 పా

గతంలో ఏర్పడిన వ్యవహారాలలో అనుకూలతలుంటాయి. కాని మిశ్రమ ఫలితాలుంటాయి. ఇతరులతో మాట్లాడే సమయంలో వాదన చేయవద్దు. నూతన గృహ నిర్మాణాలలో మార్పులు ఏర్పడుతాయి. అంచనాలు మించుతాయి. ఇచ్చిన రుణాలు వసూలు కాగలవు. కళా, క్రీడాకారులు చిన్నపనైనా గట్టిగా ప్రయత్నించాలి. రాజకీయులు అధిక ఖర్చులు నియంత్రించుకోవాలి.



**తుల**
చిత్త 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా

శరీరారోగ్య లోపాల వల్ల ఔషధ సేవనం అవసరమౌతుంది. ఉద్యోగులకు బదలీలు, ప్రమోషన్ల సమస్యలు అధికంగా వుంటాయి. వృత్తి, వ్యాపార, ఇతర రంగాల వారికి ఆర్థికంగా సామాన్యాను కూలతలుంటాయి. కుటుంబంలో బేధాభిప్రాయాలున్నా రోజులు హుషారుగా సాగుతాయి. బంధుమిత్రుల నుండి తీపివార్తలు వినగలరు. సంతాన విషయమై శుభవార్తలు వింటారు.



**వృశ్చికం**
విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ

కుటుంబ వ్యవహారాలలో సంయమనం పాటించుట మంచిది. మనోభీతి, ప్రయాణాల పట్ల జాగ్రత్తలు తీసుకోవాలి. వృత్తి, వ్యాపారాలలో ఆర్థికస్థితి సామాన్యంగా వుంటుంది. అనవసర మాటలచే శత్రుత్వాలు ఏర్పడగలవు. అవసరానికి సహాయం చేసేవారు తక్కువ. తల్లిదండ్రుల ఆరోగ్యాలు ఆందోళన కలిగిస్తాయి. అన్నింటా వ్యతిరేకత లుంటాయి. రాజకీయులు అప్రమత్తంగా వ్యవహరించాలి.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

అనవసర ప్రసంగాలకు తావివ్వక చేపట్టిన పనులపై శ్రద్ధ పెట్టండి. ధన వినియోగంలో పొరపాట్లకు అవకాశముంది. వృత్తి, వ్యాపారాలు సామాన్యం. బంధుమిత్రుల సహాయసహకారాలుంటాయి. కుటుంబ పెద్దలతో మాట పట్టింపులుంటాయి. భాగస్వామ్య వ్యాపారుల మధ్య అవిశ్వాసం పెరగగలదు. విద్యార్థులు పై చదువులకై చేసే ప్రయత్నాలలో పొరపాట్లు చేయకుండా జాగ్రత్త వహించాలి.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

తలపెట్టిన పనులు నిదానంగా సాగుతాయి. నిర్ణయాలలో తొందరపాటుతనం పనికిరాదు. తరచూ ఉద్యోగ, వృత్తి, వ్యాపారాలలో బుద్ధిమాంద్యం పొందుట, ఎదుటి వారి నుండి విమర్శలెదుర్కొనుట వుంటుంది. నూతన వ్యక్తుల పరిచయాలతో కొత్త పనులకై ఆలోచన చేయగలరు. విద్యార్థులకు ఎన్ని సమస్యలెదురైనా కాలేజీలలో చేరగలరు. రాజకీయులకు తొందరపాటు మాటలు వద్దు.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

మనోధైర్యం పెరిగి, యత్న కార్యసిద్ధి, చేపట్టిన పనులలో ఆటంకాలున్నా ఫలిస్తాయి. వాదవివాదాలకు దూరంగా వుండండి. అనవసర ఖర్చులుంటాయి. అన్ని విషయాలలో తగు జాగ్రత్తలవసరం. విద్యార్థులు నూతన ప్రవేశాలకై చేసే ప్రయత్నాలు చీకాకులు తెప్పిస్తాయి. వృత్తి, వ్యాపార, ఇతర రంగాలలో ఆదాయ విషయాలను నియంత్రించుకోవాలి.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా. ఉత్తరాభాద్ర, రేవతి

తల్లిదండ్రుల ఆరోగ్య విషయంలో జాగ్రత్తలవసరం. యంత్ర, వాహనాదులచే ఇబ్బందులు. నిరుద్యోగులు స్వయం కృషికి ప్రాధాన్యత ఇవ్వడం మంచిది. అనవసర ఆడంబర ఖర్చులు. బంధువర్గంతో వివాదాలు, ఇంట్లో దొంగతనం లేదా ఒంటిమీద నగల చోర్యం జరుగుట, శాంతి సౌఖ్యాల లేమిచే బాధలు పడగలరు. విద్యార్థులకు కష్టం మీద గాని పనులు కావు.

## పంచాంగం

| | |
|---|---|
| 30తేది | శీతలాష్టమి. |
| 1తేది | కుసుమహర జయంతి. |
| 3తేది | గురుమౌఢ్యమి త్యాగం. |
| 4తేది | అల్లూరు సీతారామ జయంతి. |

### శుభ ముహూర్తాలు

జూలై 8తేది వరకు గురుమూఢమి జరుగుతున్నందున శుభముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య వ్యవహారాలకు శుభ ముహూర్తాలున్నాయి.

**జూన్ తిథులు**
**జ్యేష్ఠ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 29 | శని | సప్తమి | రా 10.25 | గం.ల.వ |
| 30 | ఆది | అష్టమి | రా 10.31 | గం.ల.వ |

**జూలై తిథులు**

| | | | | |
|---|---|---|---|---|
| 1 | సోమ | నవమి | రా 11.23 | గం.ల.వ |
| 2 | మంగళ | దశమి | రా 12.54 | గం.ల.వ |
| 3 | బుధ | ఏకాదశి | రా 02.56 | గం.ల.వ |
| 4 | గురు | ద్వాదశి | తె 05.16 | గం.ల.వ |
| 5 | శుక్ర | త్రయోదశి | | పూర్తిగా |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.

# వృక్షం, తదాశ్రిత పక్షిజాల నాశనమే మానవుల వినాశనం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4. ఫోన్: 2322345, సెల్: 9490125878.

*టి.కె.ఆర్.శాస్త్రి — హైదరాబాద్*

** కృష్ణవాస్తులో మానవ వినాశనాన్ని గురించి చెప్పారా?*

ప్రస్తుతం ప్రచారంలో వున్న కృష్ణవాస్తులో గాక ప్రాచీన కృష్ణవాస్తు(సరస్వతి బాండాగారం, తంజావూరు)లో పక్షి, క్రిమికీటక, వృక్ష వినాశనం జరిగితే మానవుడు కొద్ది సంవత్సరాలలోపే నశించి పోతాడని ఉల్లేఖించబడింది.

*టి.జానకిరామిరెడ్డి — కలువాయి*

** బాగా కాసిన తోట ఈ సంవత్సరం నష్టాల్ని చూపించింది.*

ఉత్తరాన్ని బట్టి అది 'దిష్టి' దోషమవుతుంది. అందువల్ల శక్తి విగ్రహ ప్రతిష్ట లేదా యంత్ర ప్రతిష్ట చేస్తే 'దిష్టి' తొలగిపోతుంది.

*ఎం.విజయమ్మ — చిత్తూరు*

** అన్నదానం చేస్తే ఆయన ఆరోగ్యం బాగు పడుతుందన్నారు.*

ఆ మాట నిజమే కావచ్చు. ఆకలి బాధతో అలమటిస్తున్న వారిని గుర్తించి రోజూ ఒకరిద్దరికి అన్న పెట్టండి చాలు. ముందు స్పెషలిస్టును సంప్రదించండి. ఛాందసాలతో ఆలస్యం చేయకండి.

*టి.కె.రెడ్డి — కిసాన్‌నగర్*

** ఇంట్లో అనారోగ్యాలున్నాయి. రాత్రిళ్లు శబ్దాలు వినిపిస్తుంటాయి.*

ఇంటికి ఏ వైపున సమాధులున్నా నిర్దుష్టమైన యంత్ర ప్రతిష్ట చేసుకోవాలి. దీనివల్ల శక్తి ప్రభావాల నుంచి మీరు తప్పించుకొంటారు.

*సి.భరణి — అనంతపురం*

** ధనం, అధికారబలంతో చుట్టు ప్రక్కల ప్రాంతాల్ని కాలుష్యమయం చేస్తున్నారు.*

ఆ ఫ్యాక్టరీలో విపరీతమైన వాస్తు దోషాలున్నాయి. 2014 అక్టోబరు నుంచి వాళ్ల పతనం ప్రారంభమవుతుంది. స్వలాభం కోసం పల్లెల కాలుష్యమయానికి కారకులైన అతను, అధికారులు ఖర్మ ఫలితాల్ని తప్పక అనుభవిస్తారు.

*టి.వి.ఆర్ — తడ*

** ఆస్తులు, ఆదాయమూ వున్నాయి. అయినా ఎప్పుడూ సమస్యలే!*

దోష ప్రభావమంటే ఇదే! వాటికి పరిష్కారాలు చేయించండి. మీరు సుఖంగా వుంటారు. శాస్త్రం సైన్సు అంటే ఇదే. నిర్దిష్ట యంత్ర ప్రతిష్ట చేయండి. మీ బాబు కోలుకొంటాడు.

*సయ్యద్ జమీర్ — నెల్లూరు*

** ఊరి బయట బహుళ అంతస్థులు నిర్మించేటప్పుడు పాటించవలసిన పద్ధతులేవి?*

అక్కడి స్టోరు, లేదా వాచ్‌మెన్ గదిలో సంబంధిత యంత్రాన్ని ప్రతిష్టించి పనులు ప్రారంభించాలి. ఊరి బయట దుష్ట శక్తులకు, యంత్ర ప్రతిష్ట చాలా అవసరం. లేని పక్షంలో అవాంతరాలు ఎదురౌతాయి.

*డి.ప్రవీణ్‌శర్మ — కావలి*

** సమస్యలన్నీ ఒకసారి పైబడినట్లున్నాయి. ఉపాయం చెప్పండి?*

పరిస్థితులను బేరీజువేసి నిర్దుష్టమైన 'యంత్ర' ప్రతిష్ట చేసుకోవడం ఉత్తమం. ఆ తర్వాత వాస్తు లోపాల్ని సరిచేసుకోవచ్చు.

*ఎన్.ఆర్.కె — విజయవాడ*

** గురువు గారు మంత్రించిన నిమ్మకాయలనిచ్చారు. అత్తగారు అపార్థం చేసుకొన్నారు.*

నిమ్మకాయల్ని పెట్టే ముందు అత్తామామలకు చెప్పాల్సింది. చెబితే ఈ గొడవలు రావుకదా? గృహిణి దైవప్రార్థనలు చేస్తే చాలు చాలా సమస్యలు పరిష్కరింపబడతాయి. ఈ ఛాందసపు పనులు చేయకండి.

*పి.శైలజ — గూడూరు*

** మా యింటికి నైరుతిలో స్థలం వున్నది. దాని ప్రభావం మాపై వుంటుందా?*

ఈ స్థలాన్ని నైరుతి హెచ్చు దొడ్డి అంటారు. దాన్ని అమ్మివేసి వుండాలి. ఇల్లు కట్టారు కాబట్టి సంబంధిత యంత్రాన్ని ప్రతిష్టించుకోండి. దుష్ప్రభావాలు తగ్గుతాయి.

*టి.వైదేశాస్త్రి — విజయవాడ*

** శంఖుస్థాపనలకు శాస్త్రాలు ఏయే కొయ్యలు సూచించాయి?*

ద్వాదశాష్ట వాస్తు శాస్త్రాల్ని క్రోడీకరిస్తే గంధం, మద్ది, వేప, చంద్ర, అత్తి కొయ్యల్ని మాత్రమే అవి ఆమోదించాయి.

● ఎర్రచందనం, ఇసుక, రేషన్ బియ్యం, గ్రావెల్...

# అక్రమ రవాణాను అడ్డుకొనే వారెవరు?

> జిల్లా నుంచి ఎర్ర చందనం దుంగలు, ఇసుక, రేషన్ బియ్యం, గ్రావెల్ ఒక పథకం ప్రకారం ప్రక్క రాష్ట్రానికి తరలిపోతున్నా సంబంధిత శాఖాధికారులు చోద్యం చూస్తున్నారే తప్ప అడ్డుకోను ప్రయత్నించడం లేదు.

జిల్లాలో వృక్ష సంపద, ఖనిజ సంపదను కొందరు కొల్లగొడుతున్నారు. ప్రధానంగా ఎర్ర చందనం ప్రతిరోజు పట్టుబడుతోంది. అయిన కూడా దీనిని నియంత్రించలేకపోతున్నారు. రాజకీయ నేతల సహకారంతో మాఫియా ముఠాలు మరింత రెచ్చిపోతున్నాయి. అక్రమంగా తరలిస్తున్న ఎర్రచందనం దుంగలతోపాటు వాహనాలను పట్టుకుంటున్నప్పటికి అసలు సూత్రధారులు తప్పించుకుంటున్నారు. అటవీశాఖాధికారులు, పోలీసుల మధ్య సమన్వయం లేకపోవడం కారణంగా అటవీ సంపద ఇతర రాష్ట్రాలకు తరలిపోతోంది. దీంతోపాటు ఇసుక, గ్రావెల్, సబ్సిడీ బియ్యం ఇతర మార్గాల ద్వారా తరలించి కోట్ల రూపాయలు సంపాదిస్తున్నారు. ప్రభుత్వం కూడా ఖనిజ, వృక్ష సంపదపై పెద్దగా దృష్టి సారించడం లేదు.

### ఇసుక రవాణా

జిల్లాలో అనుమతిలేని రీచ్‌ల నుండి అక్రమంగా రాత్రివేళల్లో ఇసుకను తరలిస్తున్నారు. పగటిపూట పోలీసు తనిఖీలు వుంటాయన్న అనుమానంతో రాత్రి సమయంలో అనుమతిలేని రీచ్‌ల నుండి ఇసుకను ట్రాక్టర్ల ద్వారా తీసుకెళ్తున్నారు. ఈ దఫా డెల్టాప్రాంతంలో రెండవ పంటకు అనుమతి లేకపోవడంతో సాగునీటి సరఫరా అయ్యే కాలువల లైనింగ్ పనులు ముమ్మరంగా జరుగుతున్నాయి. లైనింగ్ నిర్మాణ పనులకు ఇసుక అవసరం కావడంతో ఎటువంటి రుసుం చెల్లించకుండా ఇసుకను తీసుకువెళ్లేందుకు కొత్త ఎత్తుగడ వేశారు. స్థానిక ట్రాక్టర్ల యాజమానులతో ముందుగా ఒప్పందం కుదుర్చుకొని అర్ధరాత్రి సమయంలో తీసుకెళుతున్నారు. పోలీసులు తనిఖీలు లేకపోవడం, ఇసుకకు రీచ్‌లలో రుసుం వసూలుచేసే వారు లేకపోవడం వల్ల బాగా ఆదాయం పొందుతున్నారు.

భూగర్భ గనులశాఖ నుంచి నీటియాజమాన్య సంస్థకు ఇసుక రీచ్ నిర్వహణ బాధ్యతలు అప్పగించింది ప్రభుత్వం. ఈ శాఖ ఆధ్వర్యంలో విధులు నిర్వహించే సిబ్బంది ఇసుక రీచ్‌లను తనిఖీలు, పర్యవేక్షణ చేయడంలో కొంత వైఫల్యం చెందుతున్నారు. ఇటీవల కాలంలో భవన నిర్మాణాలు పెరిగిపోవడంతో ఇసుకకు బాగా డిమాండ్ ఏర్పడింది. మన జిల్లాలో చేపడుతున్న నిర్మాణాలకు కాకుండా చెన్నైలో నిర్మిస్తున్న భవనాలకు సైతం పెన్నానది ఇసుకను వినియోగిస్తుంటారు. జాతీయ రహదారి మీదుగా ఐదు పోలీస్‌స్టేషన్లు దాటి చెన్నైకు భారీ వాహనాలు ద్వారా ఇసుక రవాణా జరుగుతుంది. దీని వెనుక పెద్దల ప్రమేయం వుండడంతో పోలీసులు తనిఖీలు చేయడం లేదన్న విమర్శలు వినిపిస్తున్నాయి. జాతీయ రహదారిపై వున్న పోలీస్‌స్టేషన్లకు నెలవారి మామూళ్లు అందుతున్నాయన్న ఆరోపణలు లేకపోలేదు.

### గ్రావెల్ మాఫియా!

రోడ్డు నిర్మాణాలకు, కాలువల లైనింగ్ నిర్మాణ పనులకు గ్రావెల్ చాలా అవసరం. దీనిని ఆసరాగా చేసుకున్న కొందరు ఒక ముఠాగా ఏర్పడి గ్రావెల్‌ను తరలించి అనతికాలంలో కోట్లు గడిస్తున్నారు. నెల్లూరు రూరల్ మండలం పరిధిలోని దొంతాలి, అల్లూరు మండలం పరిధిలోని నార్తు ఆములూరు గ్రామాల నుంచి గ్రావెల్‌ను అక్రమంగా రాత్రిపూట ట్రాక్టర్ల ద్వారా తరలిస్తున్నారు. నార్తు ఆములూరులో ఎస్సీలకు ప్రభుత్వం పంపిణీచేసిన భూముల్లో గ్రావెల్ తీస్తున్నారు. గుంటూరు జిల్లాకు చెందిన ఒకరు ఇక్కడ గ్రామస్తులలో కొందరిని ప్రలోభాలకు గురిచేసి జెసిబి సహకారంతో గ్రావెల్‌ను తీస్తున్నారు. ఎవరికి అనుమానం రాకుండా అధికారుల కంటపడకుండా పై గ్రామాల నుండి అటవీప్రాంతం ద్వారా జాతీయ రహదారికి ఈ వాహనాలను పంపుతున్నారు.

ఈ విషయం రెవెన్యూ, పోలీసులకు తెలిసినా కూడా ఇప్పటివరకు ఒక్క వాహనాన్ని కూడా తనిఖీ చేయడంగాని, అనుమతులు ఏమేరకు ఉన్నాయన్న దానిపై పరిశీలన చేయలేదు. ఎవరైనా అధికారుల దృష్టికి తీసుకెళ్తే గ్రావెల్‌కు అనుమతి వుందంటూ సమాధానం చెబుతున్నారు. ఇప్పటికైన జిల్లా అధికార యంత్రాంగం స్పందించి జిల్లా నుంచి తరలిపోతున్న సబ్సిడీ బియ్యం, వృక్ష సంపద, ఖనిజ సంపదను కాపాడాల్సిన అవసరం వుంది.

**భలే ఉద్యోగులు**

వైద్య ఆరోగ్య శాఖ ఉద్యోగులకు కొత్త జబ్బు...

# పనిచేయమంటే దొంగ ఫిర్యాదులు చేస్తున్నారు!

> ఇందుకూరుపేట మండలం జగదేవిపేట ప్రాథమిక ఆరోగ్య కేంద్రం వైద్యాధికారి నిరంజన్ విధి నిర్వహణలో కఠినంగా వ్యవహరిస్తాడు. సిబ్బందిని ఉదయం 9 గంటల నుంచి సాయంత్రం 4 గంటల వరకు ఆరోగ్య కేంద్రంలో ఉండాలంటాడు. ఇది భరించలేని ఉద్యోగులు ఈ డాక్టర్‌పై అసత్య ఫిర్యాదుల పర్వాన్ని మొదలెట్టారు.

జిల్లా వైద్య ఆరోగ్యశాఖలో పనిచేసే ఉద్యోగులను సక్రమంగా విధులను నిర్వహించమని గట్టిగా మందలించడంతో వివాదంలో చిక్కుకున్న వైద్యాధికారి ఉదంతం ఆలస్యంగా వెలుగు చూసింది. సేకరించిన సమాచారం ప్రకారం... ఇందుకూరుపేట మండలం జగదేవిపేట ప్రాథమిక ఆరోగ్య కేంద్రం వైద్యాధికారి నిరంజన్ విధినిర్వహణలో కఠినంగా వ్యవహరిస్తాడు. ఉదయం 9గంటలకు విధులకు హాజరై సాయంత్రం 4 గంటల వరకు ఆరోగ్య కేంద్రంలో అందుబాటులో వుంటారు. అదేవిధంగా ఎఎన్ఎం, ఫార్మాసిస్టు ఇతర సిబ్బంది నిర్ణీత సమయానికి విధులకు హాజరు కావాలని సూచిస్తాడు. ఎన్నో సంవత్సరాల నుంచి విధులకు సక్రమంగా హాజరు కాకుండా వుండే వారికి వైద్యాధికారి ఆదేశాలు ఆగ్రహం తెప్పించాయి. ఇంకేముంది వెంటనే ఆయనపై ఉన్నతాధికారులకు ఫిర్యాదులు పంపారు. ఎప్పుడూ లేని విధంగా ఎఎన్ఎంలతో అమర్యాదగా ప్రవర్తిస్తాడన్నది సిబ్బంది ఆరోపణ.

ఇక్కడ ప్రధాన కారణం మరొకటి వుంది. జిల్లా కేంద్రంలోని డ్రగ్‌స్టోర్సు నుంచి ఇటీవల కొన్ని మందులు పిహెచ్‌సికి ఫార్మాసిస్టు తీసుకొచ్చారు. వీటితో పాటు అనుమతి కోరని కొన్ని మందులను రెండు అట్టపెట్టెలు తీసుకరావడాన్ని వైద్యుడు గుర్తించాడు. అనుమతి లేకుండా మందులు తేవడంపై ఫార్మాసిస్టును మందలించి రెండు అట్టపెట్టెలోని మందులను భద్రపరచాలని చెప్పాడు. ఇదే విషయాన్ని నెల్లూరులోని డ్రగ్‌స్టోర్‌లో విధులు నిర్వహించే ఉద్యోగితో ఫోన్‌లో మాట్లాడి అనుమతిలేకుండా మందులు ఎలా సరఫరా చేస్తారని ప్రశ్నించాడు. ఉద్యోగిని ప్రశ్నించిన సంగతి వెంటనే పిహెచ్‌సి ఫార్మాసిస్టుకు సమాచారం అందడంతో సిబ్బందిని పిలిపించి వైద్యుడికి వ్యతిరేకంగా లేనిపోని ఆరోపణలతో ఒక అర్జీని తయారు చేసి ఆశాఖ జిల్లా అధికారికి ఫిర్యాదు చేయడం చర్చనీయాంశంగా మారింది.

అసలు విషయమేమిటంటే అనుమతి లేకుండా తీసుకొచ్చిన రెండు అట్ట బాక్సుల్లోని మందులు కనిపించకుండా పోయాయి. ఈ విషయంపై వైద్యుడు డిఎంఅండ్‌హెచ్‌ఓకు ఫిర్యాదు చేయడంతో వెంటనే స్పందించి విచారణకు ఆదేశించారు. విచారణకు వెళ్లిన అధికారికి కూడా అక్కడ సిబ్బంది డాక్టర్‌పై ఫిర్యాదు చేశారు. విధులు సక్రమంగా నిర్వహించాలని కోరితే తనపైనే ఫిర్యాదు చేయడం ఆశ్చర్యకరంగా వుందని మిత్రుల వద్ద వాపోతున్నాడాయన. మొత్తంమీద కొత్త డిఎంఅండ్‌హెచ్‌ఓ డాక్టర్ బి.సుధాకర్ ఆదేశాలు ఆ శాఖలోని సిబ్బందికి వణుకు పుట్టిస్తున్నాయి.

### డిప్యూటేషన్ల రద్దుపై...

మందుల మాయంపై విచారణకు వెళ్లిన అధికారిని తప్పుదోవ పట్టించే విధంగా జగదేవిపేట పిహెచ్‌సి సిబ్బంది డాక్టర్‌పై ఫిర్యాదు చేయగా డిప్యూటేషన్లు రద్దుచేసిన డిఎంఅండ్‌హెచ్‌ఓపై ఈ శాఖ యూనియన్ నాయకులు గుర్రుగా వున్నారు. పదవీ విరమణ చేసిన మాసిలామణి ఎటువంటి నోట్‌ఫైల్ లేకుండానే నోటిమాటతో డిప్యూటేషన్లు వేశారు. యూనియన్ నేతలు, రాజకీయ నేతల సిఫార్సులతో డిప్యూటేషన్లు వేశారన్న ప్రచారం వుంది. కొత్తగా వచ్చిన అధికారి అన్ని డిప్యూటేషన్లు రద్దు చేయాలని ఆదేశాలు జారీ చేశారు. ఇది మింగుడు పడని కార్యాలయంలో వసూలు రాజాలుగా పేరొందిన సీనియర్ ఉద్యోగులు ఒకవర్గంగా ఏర్పడి అసత్య ప్రచారం చేసేందుకు ప్రయత్నిస్తున్నారు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లోనే కాకుండా జిల్లా కార్యాలయంలో కూడా డిప్యూటేషన్లపై కొందరు విధులు నిర్వహిస్తున్నారు. జిల్లా కేంద్రంలో పని చేస్తున్న వారు సైతం మాతృ ప్రదేశాలకు వెళ్లాల్సి వుంటుంది. కీలక విభాగాల్లో విధులు నిర్వహించేవారు అధికారి జారీచేసే ఆదేశాలను అమలు చేసేందుకు ఆసక్తి చూపకపోగా మీడియా ప్రతినిధులకు అవాస్తవాలతో కూడిన సమాచారాన్ని చేరవేసే పనికి శ్రీకారం చుట్టారు. జాతీయ బ్యాంకుల్లో డిపాజిట్ చేసిన కొంత నగదును ప్రైవేట్ బ్యాంకుల్లో జమచేసి వున్నారు. ఈ వ్యవహారం ఎవరి ఆదేశాల మేరకు మళ్లించారన్న దానిపై రహస్యంగా విచారణ జరుగుతోంది. కార్యాలయ సిబ్బంది చెప్పిన విధంగా మాజీ అధికారి వ్యవహరించి ఎసిబి కేసుల్లో ఇరుక్కునే వరకు వెళ్లిన సంగతి అందరికి తెలిసిందే. ప్రస్తుత అధికారి సిబ్బందికి అనుకూలంగా వ్యవహరించకపోగా, ప్రతి అంశంపై ఆరా తీస్తుండడం యూనియన్ నేతలు జీర్ణించుకోలేకపోతున్నారు. జిల్లా వైద్య ఆరోగ్యశాఖ మాజీ అధికారి మాశిలామణి కార్యాలయంలో కీలక విభాగాల్లో విధులు నిర్వహిస్తున్న ఇరువురు సీనియర్ అసిస్టెంట్ల సర్వీసు రికార్డులను ఎసిబి అధికారులు స్వాధీనం చేసుకున్నారు.

# యాక్షన్ 3డి పరవాలేదు!



✍ అల్లూరు రహీం

నిర్మాత అనిల్ సుంకర దర్శకునిగా మారారు. ఆయనకు ఓ ప్రత్యేక చిత్రం తీయాలని అభిలాష. దీనికోసం న్యూయార్క్ ఫిలిం అకాడమీలో దర్శకత్వానికి సంబంధించిన కోర్సు చదివాడు. హాలీవుడ్‌లో ప్రత్యేకంగా తయారయ్యే 3డి చిత్రాలు ఆయన్ను ఆకర్షించినట్లున్నాయి. తెలుగులో తొలిసారిగా 'యాక్షన్ 3డి' సినిమాకు శ్రీకారం చుట్టారు. అప్పుడెప్పుడో మళయాళంలో తయారైన 'చోటా చేతన్' సినిమా చూసిన ప్రేక్షకులకు యాక్షన్ 3డి సినిమా సరికొత్త అనుభూతి మిగిల్చేలా తీయను దర్శకుడు కష్టపడ్డాడు. వినోదాత్మక బాణీలో తెలుగు సినిమాలో ఉండే అన్ని హంగులను ఈ 3డి చిత్రంలో గుదిగుచ్చారాయన. సినిమా మొదలు కాగానే టైటిల్స్ మన కళ్ల మీద పడతాయి. వర్షం మన మధ్యే కురుస్తుంది. ఫైట్స్‌లో విసిరే కోడిగుడ్లు, బాంబులు మన ప్రక్కనే వచ్చి పేలుతుంటాయి. హీరోయిన్ల అందాలు ప్రేక్షకుల కళ్లకు దగ్గరగా వస్తాయి. కె.రాఘవేంద్రరావు సినిమాల్లోని పాటలు సందర్భోచితంగా బిట్లు బిట్లుగా తనదైన బాణీలో దర్శకుడు చిత్రీకరించిన తీరు బాగుంది. పాటల్లో స్వాతిముత్యపు జల్లులలో, రమ్మని పిలిచే రాం చిలకాలకు బప్పీ – బప్పీలహరి చేకూర్చిన సంగీతం బాగుంది. నీ నడుము, డింగ్ డాంగ్ పల్లవులతో మొదలయ్యే పాటల్లో 3డి ఎఫెక్ట్సులో హీరోయిన్ల అందాలు చూడను రెండు కళ్లు చాలవు. ఎం.ఎస్.నారాయణతో చేయించిన కామెడీ ట్రాక్ బాగుంది. బ్రహ్మానందం, అలీలు కూడా హీరో కామెడీకి తమ వంతు సహకరించారు. కెమెరా సర్వేష్‌మురారి తీసినా, స్టీరియో గ్రాఫర్‌గా అమెరికన్ నిపుణుడు కీత్‌డ్రైవర్ ఈ చిత్రానికి ప్రాణం పోశాడు. గ్రాఫిక్స్‌లో సృష్టించిన పులి, చింపాజీలు ఈ సినిమాకు వచ్చిన పిల్లలను ఆనందపరుస్తాయి. దర్శకుడే వ్రాసిన మాటల్లో డబ్బు మంచి నీళ్లలా ఖర్చు పెడితే కన్నీళ్లే. ఫిగరులేని ఆడది, పొగరులేని మగాడు వేస్ట్. కష్టపడితే పైకిరారు, లవ్వంటే లాజిక్ ఉండదు ఆలోచింపజేస్తాయి. సాంకేతిక అంశాల మీద దర్శకుడు ఇంకాస్త శ్రద్ధపెట్టి ఉన్నట్లైతే యాక్షన్ 3డి సినిమా ప్రేక్షకులను మంత్రముగ్ధులను చేసి ఉండేదని చెప్పక తప్పదు.




చిత్ర కథలోనికి వెళ్తే బావ(అల్లరి నరేష్), శివ(వైభవ్), అజయ్(కిక్ శ్యామ్), పురుష్(రాజు సుందరం) చిన్నప్పటి నుంచి మంచి స్నేహితులు. అజయ్‌కి పెళ్లి నిశ్చయమవుతుంది. శివకు పెళ్లయ్యి ఉంటుంది. నలుగురు ఫ్రెండ్స్ జాలీ ట్రిప్‌గా గోవా బయలు దేరుతారు. మార్గమధ్యంలో గీత(నీలం ఉపాధ్యాయ) కలుస్తుంది. బావ ఈమెపై మనసు పారేసుకొంటాడు. గోవాలో ఉండే క్లబ్బులో పేకాట ఆడి కోటి రూపాయలు సంపాదించి తన తండ్రి కలల సౌధమైన హోటల్‌ను మొదలు పెట్టాలన్నది బావ కోరిక. ఒక పబ్‌కు వెళ్లి నలుగురు మిత్రులు ఫుల్‌గా తాగేస్తారు. పబ్‌లో డ్యాన్సర్ సమీర (స్నేహాఉల్లాల్)ను శివ పెళ్లి చేసుకొంటాడు. కాసినోలో బావ గీత లక్కీ నెంబర్‌పై పందెం కాసి కోటి రూపాయలు గెలుస్తాడు. కానీ నలుగురు మిత్రులను ఈగ ఫేం సుదీప్ కిడ్నాప్ చేస్తాడు. అజయ్ పెళ్లి రోజు దగ్గరపడడంతో నానాపాట్లు పడి నలుగురు మిత్రులు తప్పించుకొని హైదరాబాద్ చేరడంతో కథ ముగుస్తుంది.

కామెడీ పాత్రల పోషణ అల్లరి నరేష్‌కు కొట్టిన పిండి. అదే తరహాలో యాక్షన్ 3డిలో లాగించేశాడు. వైభవ్, కిక్ శ్యామ్, రాజు సుందరం తమ పాత్రలు కూడా బాగానే పోషించారు. హీరోయిన్ నీలం ఉపాధ్యాయ, స్నేహా ఉల్లాల్ గ్లామర్ బొమ్మలుగా నిలుస్తారు. ఈ సినిమా కథ చెప్పే ఒబామా పాత్రకు హీరో సునీల్ దర్శకుడు అనిల్ సుంకర మీద ఉన్న గౌరవంతో ఒప్పుకొన్నట్లున్నాడు. ఏది ఏమైనా యాక్షన్ 3డికి టైమ్‌పాస్ చేయనైనా వెళ్లొచ్చు.

## ఎవర్నీ ప్రేమించలేదు!



వరుస పరాజయాలతో సతమతమవుతున్న హీరోయిన్ శ్రియకు 'పవిత్ర' చిత్రంలోని వేశ్యపాత్ర నటనాపరంగా బాగా తృప్తి నిచ్చిందంటుంది. పవిత్ర పాత్ర పోషించే ముందు మండి, మిర్చి మసాలా చిత్రాలను చూశాను. అందులో స్మితాపాటిల్ నటనను బాగా గమనించానంది. అక్కినేని కుటుంబ హీరోలు నటించే మనం చిత్రంలో తనకు నాగార్జున సరసన నటించే అవకాశం రావడం అదృష్టంగా భావిస్తున్నానంది. నాగార్జున గారి సరసన సంతోషం, నేనున్నాను చిత్రాలలో మెప్పించాను. మనంలో ఇంకా మెప్పిస్తానంది. పెళ్లి విషయమై వస్తున్న పుకార్ల గూర్చి ప్రస్తావిస్తే... నాకు ఎలాంటి ప్రేమ వ్యవహారాలు లేవు. పెద్దలు కుదిర్చిన వివాహమే చేసుకుంటాను. పెళ్లి కుదిరిన వెంటనే అందరికీ చెప్తానంటుంది.

## అసిన్ భాషాభిమానం



హీరోయిన్ అసిన్‌కు ప్రయాణాలంటే చాలా ఇష్టం. కాస్త ఖాళీ దొరికితే చాలు దేశవిదేశాలు చుట్టొస్తుంటుంది. ఆయా దేశాల్లోని అందమైన ప్రదేశాల్ని మాత్రమే చూసి రావడం కాకుండా... అక్కడి ప్రజల జీవన స్థితిగతులు, భాష, సంస్కృతిని కూడా క్షుణ్ణంగా పరిశీలిస్తుంటుంది. ఈ క్రమంలోనే ఇటీవల జర్మన్‌భాషపై మక్కువ పెంచుకొంది. ఆ భాషను నేర్చుకొని తీరాల్సిందే అంటూ ప్రయత్నం మొదలు పెట్టేసింది. అన్నట్లు భాష నేర్చుకోవడం అసిన్‌కు భలే సరదా. ఆమె తొలి చిత్రం 'అమ్మ నాన్న ఓ తమిళమ్మాయి' చేస్తున్న సమయంలోనే తెలుగు భాష నేర్చుకొంది. ఆ తర్వాత హిందీకి వెళ్లి పోయింది. అక్కడ కుడా పరిస్థితుల్ని తొందరగా ఒంటబట్టించుకొంది. ఉత్తరాది శైలిలో హిందీ నేర్చుకొని స్థానిక ముద్దుగుమ్మలకు ధీటుగా రాణిస్తోంది. అసిన్ ఇంకెన్ని భాషలు నేర్చుకొంటుందో చూడాలి.

## పాటల శింబు



ఇదివరకు అనువాద చిత్రాలతో తరచుగా తెలుగు ప్రేక్షకుల్ని పలకరించేవాడు తమిళ హీరో శింబు. కానీ ఈ మధ్య ఆయన సినిమాలు తెలుగులో విడుదలవడం తక్కువైంది. అది లోటుగా భావించాడో ఏమో... నటుడిగా కుదరకపోయినా గాయకుడిగా తెలుగు ప్రేక్షకులకు నిత్యం టచ్‌లోకి వస్తున్నాడు. మీ పాట కావాలి అని మన దర్శకులు అడగడమే ఆలస్యం... వచ్చి గొంతు సవరించుకొంటున్నాడు శింబు. ఇటీవల బ్యాక్‌బెంచ్ స్టూడెంట్, బాద్‌షా చిత్రాల్లో శింబు పాటలు వినిపించాయి. ఇప్పుడు మనోజ్ కోసం సింగేశాడు. మంచు మనోజ్ కథా నాయకుడిగా 'పోటుగాడు' అనే చిత్రం తెరకెక్కుతోంది. ఈ చిత్రం కోసం శింబు ఓ పాటపాడాడు. మంచు మనోజ్ దగ్గరుండి ఆ పాటను రికార్డ్ చేయించారు. ఆ పాట గురించి మనోజ్ ట్విట్టర్‌లో తన ఆనందాన్ని వ్యక్తం చేశాడు.

## సినిమాలో చదువుకున్నాను!



సరదాగా అమ్మాయితో చిత్రం ఓ మోస్తరుగా ఆడుతుండడంతో హీరో వరుణ్ సందేశ్‌లో జోష్ పెరిగింది. అబ్బాయి క్లాస్ అమ్మాయి మాస్, ఉదయం, నువ్వలా నేనిలా, మోహన్‌బాబు స్వంత సినిమాల్లో నటించే అవకాశం కూడా వచ్చింది. హీరో అవ్వడంతో వరుణ్ సందేశ్ చదువు మధ్యలో ఆగిపోయింది. ఈ విషయమై చెబుతూ నేను ప్లస్ టూ వరకు చదువుకున్నాను. సినిమాల్లోకి వచ్చాక చదవడం కుదరలేదు. అయితే ఇక్కడ జీవితాన్ని చదువుతున్నాను. నిత్యం రకరకాల మనుషుల్ని కలుస్తుంటాను. ప్రతీ సినిమాలోనూ భిన్నమైన పాత్రల్ని పోషిస్తున్నాను. ఎంతోమంది అనుభవజ్ఞులైన నటులతో కలసి పని చేస్తున్నాను. నాకు తెలిసి ఇంత కంటే చదువు ఉండదన్నాడీ హీరో.

## టీవీ తెరపై శ్రీదేవి!



తెలుగు సినీ ప్రేక్షకులకు అతిలోక సుందరి శ్రీదేవి. ఇంగ్లిష్ వింగ్లిష్ సినిమాతో విజయవంతంగా తన రెండో ఇన్నింగ్స్‌కు శ్రీకారం చుట్టింది. ఆమె త్వరలో బుల్లితెరపై కూడా సందడి చేయబోతున్నట్లు ప్రచారం సాగుతోంది. తెలుగులో ఓ టెలివిజన్ ఛానల్‌లో ప్రసారం కానున్న కార్యక్రమానికి ఆమె వాఖ్యాతగా వ్యవహరిస్తారని తెలిసింది. ఒక్కో ఎపిసోడ్‌కు 25 లక్షల పారితోషికం అందుకోబోతున్నట్లు సమాచారం. ఇటీవలే ఆమె భర్త బోనీకపూర్ హైదరాబాద్ వచ్చి ఆ కార్యక్రమానికి సంబంధించిన విషయాలపై సుదీర్ఘంగా చర్చలు సాగించినట్టు తెలిసింది. శ్రీదేవి తెలుగు ప్రేక్షకులకు దూరమై చాలా రోజులే అయినా... ఇప్పటికీ ఆమెకు భాషపై మంచి పట్టుంది. తెలుగులో చక్కగా మాట్లాడుతుంది. స్వతహాగా మంచి గొంతు కూడా ఉండడంతో ఆమె నిర్వహించబోయే కార్యక్రమం కోసం ప్రేక్షకులు ఆసక్తిగా ఎదురు చూస్తున్నారు.

● సాంఘిక సంక్షేమ శాఖలో

# అవినీతి నిజమన్న డిడి!

**సమీక్షా సమావేశంలో విస్తుపోయిన అధికారులు**

సాధారణంగా ఆయా శాఖల్లో జరిగే అక్రమాలు, అవకతవకల గురించి ఆ శాఖల ఉన్నతాధికారులు మసిపూసి మారేడు కాయ చేస్తుంటారు. అంతా సవ్యంగా వున్నట్లే చెబుతుంటారు. దీనికి భిన్నంగా వ్యవహరించి సాంఘిక సంక్షేమ శాఖలో అక్రమాలు జరుగుతున్నాయని ఘంటాపథంగా నిండు సమావేశంలో ఒప్పుకొన్నాడు డిప్యూటీ డైరెక్టర్ విశ్వమోహన్. ఇటీవల జిల్లా కలెక్టర్ విద్యావారోత్సవాలపై ఆయా శాఖల అధికారులతో సమీక్షా సమావేశం నిర్వహించారు. స్థానిక గోల్డెన్ జూబ్లీ హాలులో జరిగిన ఈ సమావేశంలో విద్యాశాఖ, రాజీవ్ విద్యా మిషన్, సాంఘిక సంక్షేమ శాఖల అధికారులు పాల్గొన్నారు. కలెక్టర్ శ్రీధర్ విద్యార్థులకు సంబంధించి చదువులు, హాస్టళ్ల తీరుపై కూలంకషంగా చర్చించి ఒక దశలో తీవ్రస్థాయిలో ఆగ్రహావేశాలు వ్యక్తం చేశారు. ఈ సందర్భంగా హాస్టళ్లలో పిల్లల సంఖ్య గతంలో పోలిస్తే తక్కువగా వుందని, ఇంకా భర్తీ కావల్సి వుందని కలెక్టర్ అనగా దానికి పిడి విశ్వమోహన్ సమాధానాన్నిస్తూ పైవిధంగా వ్యాఖ్యానించారు. సార్, గతంలో హాస్టళ్ల విద్యార్థుల హాజరు నమోదులో అక్రమాలు, అవకతవకలు జరిగేవి. తక్కువ మంది వున్నా ఎక్కువ మంది వున్నట్లు చూపి స్వాహా జరుగుతుండేది. ఇప్పుడు రాత్రిళ్లు విద్యార్థులు ఎంత మంది హాస్టళ్లలో నిద్రిస్తున్నారో గమనించి, దానిప్రకారం హాజరు శాతం పక్కాగా గుర్తించామని చెప్పడంతో వాడివేడిగా వున్న సమావేశంలో ఒక్కసారిగా నవ్వులు విరిశాయి. ఆ అధికారి సమాధానంతో కలెక్టర్ శ్రీధర్ సైతం పడిపడి నవ్వకుండా వుండలేకపోయారు.

# అంతా మా యిష్టం...

**ప్రైవేటు పాఠశాలల తీరేవేరు**

అంతా మా ఇష్టం... మేమెవ్వరికీ భయపడం అన్న పాట లాగా వుంది కొన్ని కార్పొరేట్ ప్రైవేట్ పాఠశాలల వ్యవహారం. నిన్నటి వరకు ఐఐటి, టెక్నో, గ్లోబల్, ఒలంపియాడ్‌ల పేరుతో విద్యార్థులకు, తల్లిదండ్రులకు అరచేతిలో స్వర్గం చూపించిన విద్యాసంస్థల యాజమాన్యాలు నేడు వసూలు చేస్తున్న ఫీజులతో కళ్లు తిరిగేలా చేస్తున్నాయి. నర్సరీ, ఎల్‌కెజి, యూకెజీల దగ్గర్నుంచి చిన్న తరగతులకే పాతిక వేల నుంచి నలభై వేల రూపాయలు ఫీజుల రూపంలో వసూలు చేస్తుండడంతో విద్యార్థుల తల్లిదండ్రులపై మోయలేని భారం పడుతోంది. తమ పిల్లలకు మంచి విద్య అందించాలన్న ఒకే ఒక్క కారణంతో తమ శక్తికి మించి చదివిస్తున్నారు. ఈ బలహీనతను తమకు అనుకూలంగా మలచుకొని విద్యా వ్యాపారం చేస్తూ దోచుకొంటున్నారన్న ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. చిన్న క్లాసులకు పేరొందిన సంస్థలు వసూలు చేస్తున్న ఫీజులు గమనిస్తే ఇంటర్, డిగ్రీలు చదివినా అంతంత ఫీజులు కావనే వ్యాఖ్యలు వినవస్తున్నాయి. దీనికితోడు పుస్తకాలకు అదనంగా వసూలు చేస్తున్నాయి. ఇవి చాలవన్నట్లు ఆయా విద్యాసంస్థలు చెప్పిన చోటే యూనిఫాం కొనుగోలు చేయాలి. ఇందులోనూ వ్యాపార సూత్రమే. ఈ పరిస్థితులలో ఫీజుల నియంత్రణకు ప్రభుత్వం ఎలాంటి చర్యలు చేపట్టకపోవడం విమర్శల పాలవుతోంది. సాధారణంగా ఫీజుల పెంపు తదితర అంశాలపై తల్లిదండ్రులతో కమిటీ వేసి చర్చించి దీనికి తగినట్లు ఫీజులు నిర్ణయించాలి ఆయా విద్యాసంస్థలు. కానీ ఇదెక్కడా అమలు కావడం లేదు. విద్యాశాఖాధికారికి ఇవేమీ పట్టవు. తనకు ఆదాయమొస్తుంటే చాలు ఎవరు ఏమి చేసుకొన్నా పట్టించుకోరనే విమర్శలు వుండనే వున్నాయి. తల్లిదండ్రుల్లో చైతన్యం వస్తే తప్ప ఈ ఫీజుల దోపిడీకి అడ్డుకట్ట పడేలా లేదు.

# కొత్త టాస్క్‌ఫోర్స్!

● వీళ్లైనా పనిచేస్తారా?

జిల్లాలోని వివిధ శాఖల పనితీరును పరిశీలించి నివేదికను సమర్పించేందుకు జిల్లా కలెక్టర్ పలువురు అధికారులతో టాస్క్‌ఫోర్స్‌ను గతంలో ఏర్పాటు చేశారు. మండల స్థాయిలో టాస్క్‌ఫోర్స్ అధికారులు పర్యటించి ప్రతి శుక్రవారం క్రమం తప్పకుండా జిల్లా కలెక్టర్‌కు నివేదికలు అందజేసేవారు. ఒక్కో అధికారికి మూడు మండలాలను కేటాయించడం జరిగింది. సంక్షేమ హాస్టళ్లు, పాఠశాలలు, సంక్షేమ, అభివృద్ధి పథకాల అమలు తీరును పర్యవేక్షించి లోటుపాట్లను గుర్తించి, మెరుగుపరచేందుకు తీసుకోవాల్సిన చర్యలపై సూచనలు, సలహాలు చేసేవారు. ఆరు నెలల పాటు మండల కేంద్రాల్లో పర్యటించిన టాస్క్‌ఫోర్స్ అధికారులు ఏ కారణం చేతనో తెలియదుగానీ రాను రాను మండలాలకు వెళ్లడం పూర్తిగా మానేశారు. వారిలో కొందరిని మండలాలకు ప్రత్యేకాధికారిగా నియమించడం, పని భారం అధికం కావడం కూడా రద్దు చేసేందుకు మరో కారణంగా చెబుతున్నారు.

టాస్క్‌ఫోర్స్ అధికారులు ఏ క్షణంలో తనిఖీలకు వస్తారోనన్న భయంతో మండలస్థాయి అధికారులు, సిబ్బంది విధులకు హాజరయ్యేవారు. ప్రస్తుతం టాస్క్‌ఫోర్స్ అధికారుల తనిఖీలు లేకపోవడంతో సిబ్బంది మళ్లీ మొదటికొచ్చారు. మండలాలకు ప్రత్యేకాధికారులుగా నియమించిన వారు సమీక్షలు, సమావేశాలకు పరిమితం కావాల్సి వచ్చింది.

## 21మందితో టాస్క్‌ఫోర్స్

గతంలో ఏర్పాటుచేసిన టాస్క్‌ఫోర్స్ బృందం స్థానంలో కొత్తగా 21మందితో మరో బృందాన్ని జిల్లా కలెక్టర్ ఏర్పాటు చేశారు. ఈ నెల 21వ తేది వివిధ శాఖల అధికారులతో నిర్వహించిన సమీక్షా సమావేశంలో ఈ మేరకు నిర్ణయం తీసుకొన్నారు. కొత్తగా నియమించిన టాస్క్‌ఫోర్స్ కేవలం పాఠశాలలు, స్కానింగ్ సెంటర్ల నిర్వహణ తీరుపై దృష్టి సారిస్తాయి. బడి ఈడు పిల్లలను ప్రతి ఒక్కరిని పాఠశాలల్లో చేర్పించడంతోపాటు, ఎంతమంది బడికి వెళ్లకుండా వున్నారన్న దానిపై కూడా పరిశీలన చేస్తారు.

21మంది అధికారులతో కూడిన బృందం జిల్లావ్యాప్తంగా అన్ని గ్రామాల్లో పర్యటించాల్సి వుంటుంది. గతంలో ఏర్పాటు చేసిన టాస్క్‌ఫోర్స్‌లో వున్న అధికారుల పేర్లను వెల్లడించిన జిల్లా కలెక్టర్ ప్రస్తుతం ఏర్పాటు చేసిన టాస్క్‌ఫోర్స్‌లోని అధికారుల పేర్లను వెల్లడించకుండా గోప్యంగా వుంచారు. అయితే స్కానింగ్ సెంటర్ల ఏర్పాటుపై తనిఖీలు చేసే సమయంలో వైద్య నిపుణుడు లేనిదే అక్కడి రికార్డులు, సిబ్బంది ధృవపత్రాలు పరిశీలించడం సాధ్యపడదు. ఈ విషయంలో నిజాయితీగల అధికారులను గుర్తించి టాస్క్‌ఫోర్స్ బృందంలో నియమించినట్లు తెలిసింది. కొత్త టాస్క్‌ఫోర్స్‌తో ఏ మేరకు ఫలితాలు వస్తాయో వేచి చూద్దాం.

## వెలమ విద్యార్థులకు స్కాలర్ షిప్పులు!

టెన్త్, ఇంటర్ మరియు డిగ్రీ పాసయ్యి పై తరగతులు చేరగోరే వెలమ విద్యార్థులకు నెల్లూరుజిల్లా వెలమ సంఘం స్కాలర్ షిప్పులు ఇవ్వదలచింది. ఆసక్తి వున్నవాళ్లు తమ పూర్తి వివరాలను తెల్లకాగితం పై వ్రాసి మార్కుల లిస్టు, స్టడీ మరియు ఇన్‌కం సర్టిఫికేట్లు జెరాక్స్ ప్రతులు జతపరచి జూలై 10తేదీలోగా పెళ్లూరు రామయ్య నాయుడు, కార్యదర్శి, వెలమ సంఘం, పోలీస్ కాలనీ, ఎకెనగర్, నెల్లూరు–4 చిరునామాకు పంపాలి. అర్హులకు ఆగష్టు 11తేది ఈ స్కాలర్ షిప్పులు పంపిణీ చేస్తారని సంఘం అధ్యక్షులు వేగూరు కృష్ణ రాజేంద్రరావు ఒక ప్రకటనలో స్పష్టం చేశారు.

# ఇదేం పిజి కౌన్సిలింగ్?


బాహాబాహీకి దిగిన ఎన్ఎస్‌యూఐ, ఎబివిపి కార్యకర్తలు.

విక్రమ సింహపురి యూనివర్శిటీ పిజి కౌన్సిలింగ్‌లో విద్యార్థి సంఘ నేత ఘర్షణకు దిగి అభ్యర్థులపై దాడి చేయడం విద్యార్థులను భయభ్రాంతులకు గురిచేసింది. జూన్ 22న జరిగిన కౌన్సిలింగ్‌కు ఇందుకూరుపేటకు చెందిన మైనంపాటి రాజా అనే విద్యార్థి హాజరయ్యాడు. ఆ సమయంలో అక్కడకు వచ్చిన ఎన్ఎస్‌యూఐ నేత ముజీబ్ ఆ అభ్యర్థిని పలు ప్రశ్నలు వేసి సర్టిఫికేట్‌లు ఇవ్వాలని కోరగా అతను అందుకు నిరాకరించడంతో ఆ విద్యార్థిపై దాడి చేసి గాయపరిచాడు. దీంతో అక్కడ జరిగే కౌన్సిలింగ్‌కు వచ్చిన విద్యార్థులు ఆందోళన చెందారు. ఈ సమాచారం అందుకొన్న ఎబివిపి నేతలు ఘటనా స్థలానికి రావడంతో ఎన్ఎస్‌యూఐ, ఎబివిపి మధ్య వాగ్వివాదం చోటుచేసుకొంది. సమాచారం అందుకొన్న వన్‌టౌన్ పోలీసులు అక్కడకు రాగా వారిని ఎన్ఎస్‌యూఐ నేతలు లెక్కచేయకపోగా ఎమ్మెల్యే వివేకానందరెడ్డి పేరు చెప్పి బెదరించడంతో పాపం పోలీసులు ఎందుకొచ్చిన గొడవ అని నాలుగు మంచి మాటలు చెప్పి వెళ్లిపోయారు. పోలీసుల ప్రవర్తన చూసి అక్కడ వున్న విద్యార్థులు నోరెళ్లబెట్టారు. గొడవ చక్కదిద్దాల్సిందిపోయి అధికార పార్టీ విద్యార్థి నేతలను చూసి జడుసుకోవడం, కేసులు నమోదు చేసి చేతులు దులుపుకోవడం విమర్శల పాలవుతోంది. ఈ వ్యవహారంలో యూనివర్శిటీ అధికారుల తీరుపైనా విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. కౌన్సిలింగ్ జరిగే చోటుకు విద్యార్థి సంఘాలు, బయటి వ్యక్తులు, ప్రైవేట్ కళాశాలల బ్రోకర్లు ఎవరూ రాకుండా గట్టి చర్యలు చేపట్టాల్సి వుండగా అందులో విఫలం కావడమే ఈ గొడవలు జరగడానికి కారణం అన్న ఆరోపణలు వ్యక్తం అవుతున్నాయి.

## రుద్ర ప్రతాపం

16వ పేజీ కొరవ

వంటి చోట్ల వున్న వారికి దారి లేక కొండలలో చిక్కుకపోవడం వల్ల మాత్రమే ఇక్కట్లు ఎదురైనాయి. కేదార్‌నాథ్ నుంచి శ్రీనగర్ వరకు దాదాపు 80 కిలోమీటర్ల దూరం రోడ్డు మీద వాహనాలలో వున్న వారు ఎటూ పోలేక చిక్కుకపోయారు. కొందరు రోడ్డు మీదనే కొండ చరియల క్రింద సజీవ సమాధి అయ్యారు. మరికొందరు రోడ్డు మీదకు దూసుక వచ్చిన ప్రవాహ ఉధృతిలో కొట్టుకపోయారు. మొత్తం మీద ఐదారు వేల మంది వరకు ఈ ఉత్పాతంలో అశువులు బాసి వుంటారని అంచనా. ఖచ్చితమైన లెక్క ఎప్పటికీ వచ్చే అవకాశం లేదు. కొండ ప్రమాణంలో పడిన బురద కుప్పల క్రింద సమాధి అయిన వారిని ప్రవాహంలో కలిసిపోయిన వారిని ఎప్పటికీ గుర్తించే అవకాశమే లేదు. కన్పడలేదు కాబట్టి చని పోయారని భావించడం తప్ప చేయగల్గింది ఏదీ లేదు.

రోడ్డు మూసుకపోవడంతో దారిలో వున్న వారు కొండలు ఎక్కి దిగి ఆ ఉత్పాతం నుంచి బయటపడడానికి ప్రయత్నం చేశారు. వారికి దారి తెలియదు. కొండ ప్రాంతంలో నడక అలవాటు లేదు. పైగా కొండ అంచు జారిపోయి మహా ప్రమాదకరమైన పరిస్థితి. కాలు జారితే అంతే సంగతులు. ఎట్లయినా సురక్షిత ప్రదేశానికి చేరుకోవాలనే ప్రయత్నంలో కొండల మీద నడిచిన వారిలో చాలా మంది ఆకలికి, అనారోగ్యానికి బలైపోయారు. కొందరైతే దాహం తీర్చుకోవడానికి నీరు దొరకక అల్లాడి పోయారట. మరొకప్రక్క విషపు పురుగులు, పాముల బాధ. ఇట్లా దారి తప్పినవారి అగచాట్లు ప్రత్యక్ష నరకానికి ఉదాహరణలు.

### *ఇంత వరద ఎప్పుడూ రాలేదా?*

గతంలో ఎప్పుడూ లేని స్థాయిలో వానలు కురవడం వల్లనే ఇంత విధ్వంసం జరిగిందనే ప్రచారం పూర్తిగా తప్పు. హిమాలయాలలో ఇటువంటి వానలు సర్వ సాధారణం. చరిత్రలో ఎన్నోసార్లు ఇంతకంటే అధిక వర్షాలే కురిశాయి. అయితే అప్పటికి ఇప్పటికీ తేడా – అభివృద్ధి పేరుతో అక్కడ జరుగుతున్న ప్రకృతి విధ్వంసం.

ఉత్తరాఖండ్‌లో గర్వాల్ అని పిలవబడే ఈ పర్వత శ్రేణిలో దాదాపు 250 జల విద్యుత్ ప్రాజెక్టు లకు అనుమతి ఇచ్చింది ప్రభుత్వం. వాటిలో దాదాపు 80 విద్యుత్ కేంద్రాల నిర్మాణం జరుగుతున్నది.

జల విద్యుత్ కేంద్రం కట్టాలంటే నదీ ప్రవాహ మార్గాన్ని మళ్లించాలి. అందుకోసం నది అడుగు భాగంలో భారీ సొరంగాలు నిర్మించాలి. ఎగువ భాగంలో చిన్న ఆనకట్టల వంటి నిర్మాణం జరగాలి. దానితో నదులు తమ సహజ సిద్ధ ప్రవాహ గమనాన్ని కోల్పోతాయి. కొత్తదారులు వెతుక్కొంటాయి. ఆ ప్రక్రియలో కొండలు, మైదానాలలో నేల కోతకు గురి కావడం సర్వసాధారణం. మరొకప్రక్క విద్యుత్ కేంద్రాల స్థాపన కోసం అడవులను ఇష్టారాజ్యంగా నిర్మూలిస్తున్నారు. వేలాది భారీ వృక్షాలను నిర్ధాక్షిణ్యంగా కొట్టి పారేస్తున్నారు. దానితో నేల కోత మరింత అధికమౌతున్నది. ఈ విధ్వంసం చాలక నిర్మాణ అవసరాల కోసం నదీ గర్భం నుంచి పెద్ద ఎత్తున ఇసుకను తరలించడం, కొండ అంచులలో భారీ పేలుళ్ల ద్వారా బండలు పగలకొట్టి కంకర క్రషర్లు నడపడం వంటివి యదేచ్ఛగా జరిగిపోతున్నాయి. దీనితో పర్వత శిఖరాలు తమ సహజ స్వరూపాన్ని కోల్పోతున్నాయి. అసలే మట్టి కొండలు కావడంతో, ఈ పేలుళ్ల ధాటికి కొండ మొత్తం అదిరి, మట్టి కదిలిపోయి, చిన్న వాన వచ్చినా క్రిందకు జారి పోతున్నది. దాని వెన్నంటి బండరాళ్లు కదిలి పోతున్నాయి. ఆర్థిక అభివృద్ధి పేరిట హిమాలయాలను సర్వ నాశనం చేస్తున్నాయి ప్రభుత్వాలు.

ఒకప్రక్క యాత్రికుల సౌకర్యం కోసం స్థానికులు నది అంచులలో అక్రమ కట్టడాలు కట్టడం, మరొకప్రక్క విద్యుత్ కేంద్రాల యజమానులు కొండలను తొలిచి కంకరగా మార్చడం, చెట్లు కొట్టి పారేయడం వంటి మానవ తప్పిదాల వల్లనే ఈ వరద ఇంత విపత్తు రూపం ధరించింది. హిమాలయాలను వాటి మానాన వాటిని వదిలి వుంటే ఈ ముప్పు వచ్చి వుండేదే కాదు.

### *యాత్రికుల సంఖ్య తగ్గించడమే మార్గం*

కేదార్‌నాథ్ యాత్ర మరొక మూడు నుంచి ఐదేళ్ల వరకు సాధ్యం కాదు. పూర్తిగా ధ్వంసమై పోయిన 80 కిలోమీటర్ల రహదారిని పునర్నిర్మించ డానికి అంత సమయం పడుతుంది. అయితే ఆ తర్వాత కూడా ఇటువంటి ఉపద్రవాలు ఎదురు కాకుండా వుండాలంటే ఒకటే మార్గం యాత్రికుల సంఖ్యను తగ్గించడం లేదా నియంత్రించడం. దారి పక్కన అంగళ్లు, అక్రమ కట్టడాలు నిరోధించడం.

## వివేకా, ముంగమూరుల దోపిడీ!

రూరల్, సిటీ ఎమ్మెల్యేలు ఆనం వివేకానంద రెడ్డి, ముంగమూరు శ్రీధరకృష్ణారెడ్డి ప్రజాధనాన్ని దోచుకొంటున్నారని, అవినీతికి పాల్పడుతూ కోట్లాది రూపాయలు స్వాహా చేస్తున్నారని తెలుగుదేశం పార్టీ పట్టణ అధ్యక్షుడు కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి విమర్శించారు. వీరి అనుయాయులతో వివిధ రకాల రోడ్డు కాంట్రాక్టులు చేయిస్తున్నారని, ఆ రోడ్లు వేసిన మూన్నాళ్లకే రూపుకోల్పోతున్నాయన్నారు. విజయ మహల్ గేటు నుంచి కాంప్లెక్స్ వరకు కోటి రూపాయలతో నిర్మించిన సిమెంటు రోడ్డు అవినీతికి నిదర్శనం అన్న ఆయన ఆ శిలాఫలకంపై తెల్లగుడ్డ కప్పి నిరసన తెలిపారు.

## ఉపాధి కూలీలపై తేనెటీగల దాడి

జలదంకి మండలానికి చెందిన ఉపాధి కూలీలపై తేనెటీగలు దాడి చేయడంతో పలువురు గాయపడ్డారు. గమళ్లపాళెం ఉంటరి కాలువ వద్దకు ఉపాధి పనులపై వెళ్లిన కూలీలపై ఒక్కసారిగా తేనెటీగలు దాడి చేశాయి. చుట్టుముట్టిన తేనెటీగల నుంచి కాపాడుకొనేందుకు కూలీలు తలోదిక్కుకు వెళ్లినా ఫలితం లేకుండాపోయింది. తీవ్రంగా గాయపడిన వారిని 108లో కావలి ఏరియా ఆస్పత్రికి తరలించి వైద్య చికిత్స చేశారు.

## జూలైన 4న విరసం సదస్సు

విప్లవ రచయితల సంఘం ఆవిర్భావ దినోత్సవాన్ని పురస్కరించుకొని జూలై 4న టౌన్‌హాల్లో సదస్సు నిర్వహిస్తున్నట్లు విరసం జిల్లా శాఖ తెలిపింది. తెలుగు సినిమా – వాస్తవికత, సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అంశాలపై చర్చ జరుగుతుందన్నారు. అంకురం సినీ దర్శకుడు సి.ఉమామహేశ్వరరావు, సిఎస్ఆర్ ప్రసాద్ పాల్గొంటారన్నారు. అలాగే అమరవీరుల స్మారక దినాన్ని కూడా ఇదే వేదికపై నిర్వహిస్తున్నట్లు నిర్వాహకులు తెలిపారు. ఈ కార్యక్రమానికి కళ్యాణరావు, కాకరాల తదితరులు హాజరవుతారు.

## 400 బస్తాల రేషన్ బియ్యం స్వాధీనం

జిల్లా నుంచి అక్రమంగా తరలిపోతున్న 400 బస్తాల రేషన్ బియ్యాన్ని పౌరసరఫరాల శాఖ పట్టుకొంది. బుచ్చి మండలం ఇస్కపాళెంలో గల ఒక రైస్ మిల్లు నుంచి తరలించేందుకు సిద్ధంగా వున్న లారీని సమాచారం అందుకొన్న అధికారులు దాడి చేసి పట్టుకొన్నారు. ఇవి ఏ ప్రాంతం నుంచి ఎక్కడకు రవాణా జరుగుతున్నాయనే దానిపై దర్యాప్తు చేపట్టారు.

## బండి వెంకట రమణారెడ్డి మరణం



నెల్లూరు లక్ష్మీపురం నివాసి నిర్మల కాంట్రాక్టర్స్ సంస్థ అధినేత బండి రమణారెడ్డి (87) 20తేది మరణించారు. బండి వెంకట రమణా రెడ్డి మాజీమంత్రి ఆనం వెంకటరెడ్డికి నమ్మిన బంటు. దీనివల్ల ఉస్మాన్‌సాహెబ్ పేట కౌన్సిలర్‌గా కూడా ఆయన ఎన్నికయ్యారు. బండి కొండారెడ్డి, బండి రామస్వామిరెడ్డికి వరుసకు సోదరుడు రమణా రెడ్డి. ఈయనకు ఒక కుమారుడు, ఐదుగురు కుమార్తెలున్నారు. కుటుంబ పెద్దను కోల్పోయిన వీరి కుటుంబానికి మా సానుభూతి.

## కెసిఆర్‌కు వణుకు

మొదటి పేజీ కొరవ

గాణ ఇస్తుందా అన్నది అసలు ప్రశ్న. రేపటి ఎన్నికలలో రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ నామరూపాలు లేకుండా పోతున్నదని అన్ని సర్వే నివేదికలూ స్పష్టం చేస్తున్నాయి. అటు తెలంగాణాలో, ఇటు ఆంధ్రాలో కూడా కాంగ్రెస్ పార్టీ పరిస్థితి ఏమాత్రం బాగా లేదు. ఈ రాజకీయ సమాధి నుంచి తన పార్టీని రక్షించుకోవడానికి తెలంగాణ అస్త్రాన్ని ప్రయోగిస్తు న్నారని పరిశీలకుల భావన. తెలంగాణ తాము ఇచ్చాము కాబట్టి కనీసం ఈ ప్రాంతంలో అయినా కొద్ది శాతం ఓట్లు, సీట్లు దక్కుతాయన్నది సోనియా గాంధీ అంచనా అట. అయితే ఆ ప్రతిపాదనను మన్మోహన్‌సింగ్ పూర్తిగా వ్యతిరేకిస్తున్నాడు. తెలంగాణ ఏర్పడితే అది మరొక ఛత్తీస్‌ఘడ్‌గా మారుతుందని, మావోయిస్టులు పేట్రేగి పోతారని హెచ్చరిస్తున్నాడు ప్రధాని. హోం శాఖ అభిప్రాయం కూడా అదే. అయినా కూడా ప్రత్యేక రాష్ట్రం ఇవ్వాలన్న నిర్ణయం సోనియాగాంధీ నిజంగా తీసుకొంటే అది కేవలం రాజకీయ ప్రయోజనాల కోసం చేసే కుటిల ప్రయత్నంగా చరిత్రలో మిగిలి పోతుంది.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### మసీదుల్లో మంచి వసతులు!

నెల్లూరీయుల్లో దానగుణం ఎక్కువ. దీనివల్లే నగరంలోని దేవాలయాలు, మసీదులు, చర్చీలు, సకల సౌకర్యాలతో తులతూగుతుంటాయి. దేవస్థానాల్లో నెల్లూరు రాజరాజేశ్వరమ్మ దేవస్థానంలో భక్తులు క్యూలో కొద్ది సేపు నిలబడ్డా ఇబ్బంది పడకుండా దాతల సహాయంతో ఏసి సౌకర్యం ఏర్పాటు చేశారు. నగరంలో చర్చీలలో ఏసి వసతి లేకున్నా ఐదారు మసీదులు మాత్రం సెంట్రల్ ఏసి సౌకర్యంతో అలరారుతున్నాయి. నెల్లూరుజిల్లా కోర్టు ప్రక్కనుండే ఖుద్దూస్ మసీదులో అత్యాధునిక ఏసి సౌకర్యాలు పలువురిని నమాజుకు వెళ్లేలా చేస్తున్నాయి. జెండా వీధి వద్ద గల హాల్‌తాలిమ్ మసీదు, పాత కూరగాయల మార్కెట్ వద్ద బాషా మసీదుల్లోనూ ఏసి సౌకర్యాలు వున్నా ఖుద్దూస్ మసీదుతో పోటీపడలేకున్నాయి. వివాదాల్లో వున్నా ఈ మధ్య బాగా అభివృద్ధిపరచిన మసీదుల్లో ఖుద్దూస్ మసీదు మొదటి స్థానంలో నిలిచింది.

### రైతు బజార్లు నిర్వీర్యం

రైతులు తాము పండించిన పంటలను నేరుగా అమ్ముకొనేందుకు తెలుగుదేశం ప్రభుత్వం ఏర్పాటుచేసిన రైతుబజార్లు నిర్వీర్యం అయిపోయాయని టిటిడి మహిళానేత తాళ్లపాక అనురాధ ఆవేదన వ్యక్తం చేశారు. కాంగ్రెస్ ప్రభుత్వం రైతుబజార్లను పట్టించుకోకపోవడంతో అవి దిష్టిబొమ్మలుగా మారాయని వివరించారు. ఫలితంగా రైతులు పంటలను నేరుగా అమ్ముకోలేక పోతున్నారని, ధరలు విపరీతంగా పెరిగిపోతున్నాయని తెలిపారు. దీనిపై కలెక్టరేట్‌లో జరిగిన ప్రజావిజ్ఞప్తుల దినంలో ద్వామా పిడి గౌతమిని కలిసి వినతిపత్రం అందజేశారు.

## జనవాణి

2వ పేజీ కొరవ

అంశంగా మారింది. సెల్‌ఫోన్లు వాటిలోని మెమరీ కార్డులలో నీలిచిత్రాల సంస్కృతి పెచ్చు పెరిగిపోయింది. ఈ వ్యవహారాలు ఎలా అదుపులోనికి వస్తాయో అర్థం కావడం లేదు.

పి.సోమశేఖర్ నెల్లూరు

### గోవుల పట్ల అశ్రద్ధ పనికిరాదు!

గోవుల గోధూళితో నిత్యం శోభాయమానంగా బాసిల్లే సింహాచలంలోని గోశాలలో ఈ మధ్య మృత్యుఘోష వినిపించింది. నెలరోజుల వ్యవధిలో గోశాలలో 150 నుంచి 200 దూడల వరకు మృత్యువాత పడ్డాయి. చందనోత్సవ హడావుడిలో ఇలా జరిగిందని ఆలయ అధికారులు చెప్పడం ఘోరం. ఎంతో భక్తిశ్రద్ధలతో దేవస్థానానికి భక్తులు సమర్పించిన గోవుల విషయంలో ఇలా వ్యవహరించడం తగదు. ఇప్పటికైనా దేవస్థానం వారు తమ వ్యాపార దృక్పధాన్ని మానుకొని గోవుల సంరక్షణకు తద్వారా ప్రజల్లో ధార్మిక భావనల వృద్ధికి కృషి చేయాలి.

పి.అరుణకుమారి నెల్లూరు

### బాగా పనిచేయండి!

కర్నాటక ఎన్నికల్లో కాంగ్రెస్‌పార్టీ విజయం 2014 ఎన్నికలకు నాంది ప్రస్తావన అంటూ కాంగ్రెస్ పెద్దలు చంకలు గుద్దుకుంటూ అత్యుత్సాహంతో ప్రకటనలు చేయడం విడ్డూరంగా ఉంది. దక్షిణాదిలో తొలిసారి అధికారం అప్పగించాక అంతర్గత కుమ్ములాటలు, ముఠా తగాదాలు, అవినీతి ఆరోపణల వలన బిజెపి అప్రతిష్టపాలయ్యి ప్రజా విశ్వాసాన్ని చూరగొనలేకపోయింది. కొత్తగా అధికారం చేపట్టిన కాంగ్రెస్ ప్రభుత్వం సైతం కర్నాటకలో బిజెపి పాలన నుండి పాఠాలు నేర్చుకొని ప్రజాసంక్షేమమే ధ్యేయంగా పని చేయాల్సి ఉంది.

డి.పోలయ్య నెల్లూరు

# పదరంగం -73

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | | 4 | | 5 | | 6 |
| | | 7 | | 8 | | | | | |
| 9 | 10 | | | 11 | | 12 | | 13 | |
| 14 | | 15 | | | | 16 | 17 | | |
| | | 18 | 19 | | 20 | | | | 21 |
| 22 | | | 23 | 24 | | | | 25 | |
| 26 | 27 | | 28 | | | | 29 | | |
| 30 | | 31 | | | | 32 | | | |
| | | 33 | | 34 | 35 | | | | 36 |
| 37 | | | | 38 | | | | 39 | |

**అడ్డం**

1. సరస్సు (4)
4. సాలెపురుగు, పాము ఏనుగుల పేరుతో వెలసిన శైవక్షేత్రం (5)
7. అర్జంటైనా మార్కిస్ట్ విప్లవ నాయకుడు (4)
9. అందమైన, రసం (2)
11. మమకారం (3)
13. అటునుంచి తెలివి, పాటవానికి ముందు వుండేది (2)
14. తడబడిన తారంగం (3)
16. అటునుంచే రాబడి (3)
18. అటునుంచే గుడ్డు (2)
20. స్త్రీ (3)
23. నాసికా భరణం (3)
25. తెలుగు గేమ్ (2)
26. అటునుంచి కన్యత్వం కలది (2)
28. తడబడిన లీలలు (3)
29. గుల్లం (3)
30. ఊరి అవుట్‌స్కర్ట్స్ అటునుంచే (4)
32. పురుగు, కీటకం (3)
33. వారాలలో మొదటిది (4)
37. నిజం... లాంటిది. అగ్ని (2)
38. జమీందారుగారి లోగిలి (3)
39. దెబ్బ, క్షతము (2)

**నిలువు**

1. మంచి ఆచారం (4)
2. క్రింద నుంచి శక్తి, నాణ్యత (2)
3. తెలుగు కలర్ (2)
4. హిందువు ఆరంభంలో వ్రాసే పదం (3)
5. నక్క కూత (2)
6. క్రింద నుంచి ప్రఖ్యాతి (3)
8. విశ్వదాభిరాముడైన నగ్నకవి (3)
10. నేల బొగ్గు బై ప్రొడక్టు రోడ్లు వేయడానికి వాడేది (2)
12. తెలుగు డిక్టేటర్ క్రింద నుంచి వస్తున్నాడు (3)
13. క్రింద నుంచే ఆన, ఆర్డరు (2)
15. ప్రమాదం (2)
17. దానాలు చేయు వాడు (2)
19. తూణీరం (5)
20. లాయరు, అడ్వకేటు (3)
21. క్రింద నుంచి తెలుగు బెల్స్ (3)
22. ... వచ్చిందమ్మ వెన్నెల పై టేసి... తెలంగాణ నది (5)
24. లాలీపాప్‌లో రెండవ సగం లేదు (2)
25. మొదలు (3)
27. క్రింద నుంచి మేషం (2)
29. త్రాసు, ఒక రాశి (2)
31. క్రింద నుంచి భార్య. ఒక హాస్య నటుడు (2)
34. వాదించువాడు (2)
35. క్రిందనుంచి 7 రోజుల సమయం (2)
36. నీరు (2)

**సమాధానాలు**

## పదరంగం -72

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| [1]ఆ | లా | [2]ప | [3]స | | [4]టి | [5]వి | [6]దీ | | [7]ఒ |
| క్రం | | [8]రు | స | [9]ప | | [10]షా | దీ | | ప్పం |
| [11]ద | [12]రు | వు | | [13]వి | నో | దం | | [14]అం | దం |
| [15]న | కో | | [16]చి | త్రం | | | [17]వ | ధ | |
| | | [18]మా | వ | | [19]మ | | [20]రా | కా | సి |
| [21]బు | [22]ల్లి | తె | ర | | [23]మ | [24]నో | హ | రం | |
| [25]రు | త | లు | | [26]ఆ | కా | ర | ము | | [27]జా |
| జు | | [28]గు | ణ | కా | రం | | | [29]ల | జి |
| | [30]లం | త | | శ | | | [31]వ | ల | పు |
| [32]జా | బి | ల్లి | | [33]ము | సి | ము | సి | న | వ్వు |

# వందేళ్ల సినిమాకు వందనం!

జనం మీద సినిమా ప్రభావం అంతా ఇంతా కాదు. మహాత్మాగాంధీ సత్య హరిశ్చంద్ర సినిమా చూసి జీవితంలో ఎప్పుడూ అబద్ధం చెప్పకూడదని నిర్ణయించుకున్నాడు. 'భక్త పోతన' చూశాక ఒకరు యోగిగా మారిపోయారు. అలా ఎందరో సినిమాలతో మమేకమవుతారు, అనుకరణ చెందుతారు. ఇటీవల నెల్లూరు హరనాధపురంలో జరిగిన తల్లీకూతుళ్ల దారుణ హత్యలు చేసిన హంతకులు పోలీసులతో "దండుపాళ్యం" సినిమా పదే పదే చూసి ఇన్‌స్పైరయ్యామని చెప్పారు. మీడియా ప్రభావం అంత గొప్పది. అంత శక్తివంతమైన సినిమా పుట్టుక, ఎదుగుదల చాలా విచిత్రంగా వుంది.



రాజాహరిశ్చంద్ర చిత్రంలో ఒక దృశ్యం.

మొదట నిశ్చలన చిత్రాలు(స్టిల్ ఫోటోగ్రఫీ) పుట్టాయి. అంటే ఇందులో ఒక దృశ్యం మాత్రమే వుంటుంది. చలనం వుండదు. శబ్దం వుండదు. ఆ తర్వాత చలన చిత్రాలు వచ్చాయి. అవి రెండు రకాలు. మొదట మూకీ చిత్రాలు. అంటే బొమ్మలు కదులుతూ వుంటాయి. మాటలు, శబ్దాలు వుండవు. ఆ తర్వాత టాకీ చిత్రాలు వచ్చాయి. అంటే ఆ చిత్రాలలో కదలికలతో పాటు మాటలు, శబ్దాలు వినవచ్చునన్న మాట. అలా అభివృద్ధి చెందాయి మన చలన చిత్రాలు. ఈ చరిత్ర దాదాపు వంద సంవత్సరాలు సాగింది ఈనాటికి. మరికొంత వివరంగా...

## పుట్టుక

నిశ్శబ్ద చిత్రాలు అంటే స్టిల్ ఫోటోగ్రఫీని 1839లో డగూరే, నిప్పే అనే ఇద్దరు వ్యక్తులు పరిచయం చేశారు. అప్పటి నుంచి కదలికలేని ఆ చిత్రాలను కదిలించడానికి ఎన్నో ప్రయత్నాలు జరిగాయి. ఆ తర్వాత ఎడిసన్ మరియు డికెన్‌సన్ 1889లో మోషన్ పిక్చర్ కెమెరాను కనిపెట్టి ఓ గొప్ప సాంకేతిక ఘట్టానికి పట్టం కట్టారు. అయితే కెన్నిటోస్కోప్ సూత్రాన్ని, పాత మేజిక్ లాంతర్ సూత్రాన్ని మేళవించి, సిసలైన సినిమాను మొట్టమొదట ప్రదర్శించిన ఖ్యాతి 1895లో ఫ్రాన్స్‌కు చెందిన 'అగస్టిలూమియర్, లాయూలూమియర్' సోదరులకు లభించింది. ఆ మరుసటి ఏడు లూమియర్ సోదరులు, టూరింగ్ ఏజెంట్లు ఆ చిత్రాలను బొంబాయి తీసుకొచ్చారు. 1896లో జూలై 7వ తేదీన బొంబాయిలో వున్న 'ఎస్ప్లనేడ్ భవంతిలోని వాట్సన్ హోటల్‌లో కొంతమంది ప్రముఖుల సమక్షంలో మొదటి చిత్ర ప్రదర్శన ఏర్పాటు చేశారు. ఒక సినిమా ప్రొజెక్టర్ నుండి వెలువడిన కిరణాలు ప్రత్యేకంగా తయారుచేసిన ఒక వెండితెరమీద పడి చిత్రంగా చలన చిత్రంగా కనబడటం చూస్తున్న వాళ్లందరికీ 'దిగ్భ్రమ' కలిగించింది. ఈ వార్త నలుగురికి తెలియడంతో రెండు రూపాయల టిక్కెట్టు మీద రోజుకు నాలుగు ఆటలు ఏర్పాటు చేశారు.

మొట్టమొదటి ప్రదర్శనలో 'ఎంట్రీ ఆఫ్ సినిమాటోగ్రఫీ', 'అరైవల్ ఆఫ్ ఎ ట్రయిన్', 'ద సీ బాత్, 'ఎ డెమాలిషన్', 'లీవింగ్ ద ఫ్యాక్టరీ', 'లేడీస్ అండ్ సోల్జర్స్ ఆన్‌వీల్స్' అనే ఆరు చిన్న చిత్రాలను ప్రదర్శించారు. ఇవన్నీ మూకీ చిత్రాలే. ఈ మూకీ చిత్రాలకు తర్వాత రోజుల్లో ఎవరో ఒకరు ఒక పక్కగా నిలబడి వివరణ (రన్నింగ్ కామెంట్రీ)లాగా చెబుతూ వుండేవారు. ఆ తర్వాత అనేక మార్పులు, చేర్పులు, కూర్పులు చేసి 'టాకీ చిత్రాలు' తయారు చేయడంలో కృతకృత్యులయ్యారు. 1927లో థామస్ అల్వాఎడిసన్ మూకీని టాకీ చేశాడు. కదిలే బొమ్మలతోపాటు శబ్దాలు కూడా వినవచ్చే వసతిని ఏర్పాటు చేశాడు. 1927లో వార్నర్ బ్రదర్స్ దీన్ని మరింత అభివృద్ధి పరచి అక్టోబర్ 6న విజయవంతం చేశారు. 'జాజ్ సింగర్' అనే సినిమాలో 'డర్టీ హ్యాండ్స్ – డర్టీ ఫేస్' అనేది మొదట సినిమాలో వినిపించిన డైలాగ్.

## భారతదేశంలో సినిమా

అప్పట్లో విదేశాలలో సినిమా అలా అభివృద్ధి చెందుతూ వుంటే మనదేశంలో మాత్రం



రాజాహరిశ్చంద్ర చిత్రం అవుట్‌డోర్ చిత్రీకరణ.

ఎవరూ అంతగా ఆసక్తి కనపరచలేక పోయారు. అయితే 1912లో నానాభాయి గోవింద్ చిత్రే, ఆర్.జి.టోర్నీ, పి.ఆర్.టిప్పిస్ కలిసి 'పుండరీక' అనే భక్తిరస ప్రధానమైన మూకీ కథా చిత్రాన్ని నిర్మించారు. ఈ చిత్ర నిర్మాణంలో బ్రిటీష్ వారి సహకారం వుండటం, క్లోజప్ షాట్స్ లేకపోవడం, ఎడిటింగ్ జరగకపోవడం, రీరికార్డింగ్ లేకపోవడం, చిత్ర నిడివి చాలా తక్కువగా వుండటం వంటి అనేకానేక కారణాల వలన ఆ చిత్రాన్ని తొలి భారతీయ మూకీ కథా చిత్రంగా లెక్కలోకి తీసుకోలేదు.

దుండిరాజ్ గోవింద్ పాల్కే మాత్రం సినిమాను బాగా అధ్యయనం చేయసాగాడు. మిత్రులందరూ అతన్ని ఎగతాళి చేశారు. ఎద్దేవగా మాట్లాడారు. అయితే యశ్వంత్ నద్కర్ణి అనే మిత్రుడు మాత్రం ముందు ఒక దృశ్యం తీసి చూపించు అప్పుడు పెట్టుబడి పెడతాను అని



CORONATION CINEMATOGRAPH
AND VARIETY HALL
SANDHURST ROAD, GIRGAUM
BEAU IDEAL PROGRAMME
Throughout
1½ Hours Show | this week | 1½ Hours Show
RAJA HARISCHANDRA.
A powerfully instructive subject from the Indian mythology. First film of Indian manufacture. Specially prepared at enormous cost. Original scenes from the sacred city of Benares. Sure to appeal to our Hindu patrons.
Miss IRENE DELMAR.
(Duette and Dance)
THE McCLEMENTS.
(Comical Sketch)
ALEXANDROFF.
THE WONDERFUL FOOT-JUGGLER
TIP-TOP COMICS.
Time:- 6 to 7-30; 8 to 9-30; 10 to 11-30 and 11-45 to 1-15.
Note: Double Rates of Admission.

రాజాహరిశ్చంద్ర విడుదల సందర్భంగా వేసిన పోస్టర్.

వాగ్దానం చేశాడు. దాంతో పాల్కే తన భీమా పాలసీని కుదువబెట్టి ఆ డబ్బుతో సినిమా పరికరాలు కొనేందుకు 1912 ఫిబ్రవరి ఒకటవ తేదీన ఓడలో ఇంగ్లాండ్ వెళ్లాడు. లండన్ సమీపంలోని వాల్టన్‌లో 'సివిల్ హేప్‌వర్త్' అనే నిర్మాత స్టూడియోలో వారం రోజులు శిక్షణ పొందాడు. ఏప్రెల్ ఒకటవ తేదీన మూవీ కెమెరా, తదితర పరికరాలతో మన దేశానికి తిరిగి వచ్చాడు.

పాల్కే స్వదేశానికి రాగానే తన భార్య సరస్వతి, కొడుకు బాలచంద్రలపై ఒక దృశ్యం చిత్రీకరించి ధన సహాయం చేస్తానన్న మిత్రుడు నద్కర్ణికి చూపించాడు. ఆ మిత్రుడు తగిన సెక్యూరిటీ మీద ధన సహాయం చేశాడు. భార్య సరస్వతి పాల్కేకి తన నగలను కూడా తాకట్టుపెట్టమని యిచ్చారు. ఆ చిత్రంలో నటించడానికి మహిళలు ముందుకు రాకపోవడంతో పురుషులనే స్త్రీ పాత్రలకు ఎంపిక చేశారు. 'అన్నా సాలుంకే' అన్న నటుడు చంద్రమతి పాత్ర ధరించాడు. దత్తాత్రేయ దామోదర్ దాబ్కే – హరిశ్చంద్ర వేషం కట్టాడు. పాల్కే కుమారుడు బాలచంద్ర లోహితాస్యునిగా నటించాడు. అలా నాలుగు రీళ్లలో 3700 అడుగుల నిడివిగల రాజా హరిశ్చంద్ర అనే మూకీ కథా చిత్రం తయారయ్యింది. 1913లో మే 3వ తేదీన బొంబాయిలోని 'కరోనేషన్ థియేటర్'లో రాజా హరిశ్చంద్ర విడుదలయి సంచలనం సృష్టించింది. ఈ సందర్భంగానే (1913–2013) వంద సంవత్సరాలు పూర్తయిన ఈ సంవత్సరం 'భారతీయ సినిమా' వందేళ్ల పండుగ జరుపుకుంటోంది. పాల్కే స్మృత్యర్థం ప్రతి సంవత్సరం "దాదా సాహెబ్ పాల్కే అవార్డు"తో సినిమా ప్రముఖులను ప్రభుత్వం సత్కరించడం పరిపాటయింది.

**జయంపు కృష్ణ**

(కొరవ వచ్చే వారం)

## రుద్ర ప్రతాపం

8వ పేజీ కొరవ

రం. మరొకప్రక్క చూస్తే నేల కన్పించని అగాధం వంటి లోయ. కొత్తగా ఆ దారిలో ప్రయాణం చేసే వారికి కళ్లు తిరుగుతాయి. కొండ అంచున సైనిక అవసరాలకు అనుగుణంగా మాత్రమే రహదారి నిర్మించడం వల్ల, పై నుంచి జారిపడే మట్టి, బురద బండరాళ్లు రోడ్డు మీదుగానే లోయలోకి జారుతాయి. దానితో ఆ రోడ్డు మొత్తం దైవాధీనం అన్నట్లు వుంటుంది. వాన పడితే రోడ్డు మూసుకపోవడం సర్వ సాధారణం. ఇంత భారీ వరద కాబట్టి, మరింత రహదారి విధ్వంసం జరిగింది.

రుషీకేష్ నుంచి కేదార్‌నాథ్ వరకు వున్న 250 కిలోమీటర్ల దూరం ఘాట్‌రోడ్డులో మందాకిని, భాగీరథి, అలకనంద వంటి నదులు సమతలంలో ప్రవహిస్తాయి. ఇళ్ల పక్కనే నది వుంటుంది. అక్కడ నుంచి క్రిందకు పోయే కొద్దీ నది లోయలో దిగువకు వెళ్లిపోతుంది. ఇల్లు, రోడ్డు మాత్రం పై భాగాన వుంటాయి. అందువల్లనే కేదార్‌నాథ్ వరద ఉత్పాతం 80 కిలోమీటర్ల దూరానికి మాత్రమే పరిమితమైంది.

### ఆక్రమణల వల్లే అన్ని ఇళ్లు ధ్వంసం

కేదార్‌నాథ్‌కు గత పాతికేళ్లలో తీర్థయాత్రీకుల రద్దీ విపరీతంగా పెరిగింది. మే నుంచి అక్టోబర్ లోపల దాదాపు ఆరు లక్షల మంది మందిరాన్ని దర్శించుకొంటారని అంచనా. దానితో స్థానికులు వారి కోసం హోటళ్లు, అంగళ్లు, లాడ్జీలు విపరీతంగా కట్టారు. ఈ కట్టడాలపై ప్రభుత్వ నియంత్రణ లేదు. గతంలో ఉత్తరాఖండ్ ఉత్తరప్రదేశ్‌లో భాగంగా వుండేది. లక్నోలో వుండే అధికారులు ముఖ్యమంత్రులకు ఈ ప్రాంతంపై ఏ మాత్రం శ్రద్ధ వుండేది కాదు. ఆ ఉదాసీనత వల్ల అడిగేవాడు లేక రోడ్డు పక్కన విపరీతంగా ఆక్రమణలు వెలిశాయి. అవి రోడ్డుకు, నదికి మధ్యలో పుట్టుకొచ్చాయి. ఈ వరద ఉత్పాతంలో వందలాది ఇళ్లు పేక మేడల వలె కూలి పోవడానికి కారణమదే. మందాకిని, భాగీరథి నదులకు 30ఏళ్లలో ఇటీవల ఇంత వరద రాలేదు. ఈ మధ్య కాలంలో ఆక్రమణలకు పాల్పడినవారు వరద ప్రవాహాన్ని లెక్కించకుండా నది అంచులో కట్టడాలు కట్టారు. కొండలలో ప్రవహించే ఏ నదికైనా ఉరవడి జాస్తిగా వుంటుంది. ఆ ధాటికి ఇళ్లన్నీ కాగితంతో చేసిన బొమ్మల మాదిరి ప్రవాహంలో కలిసిపోయాయి.

ఇరుకు రోడ్డు కావడంతో, ఎదురెదురు వచ్చే వాహనాలు కదలడానికే ఇబ్బందిగా వుంటుంది. పక్కన నిలుపుకోవడానికి స్థలం అంటూ వుండదు. దానితో రోడ్డు మీద వున్న వాహనాలు బొమ్మల మాదిరి ప్రవాహంలో కొట్టుకపోయాయి.

### లక్ష మందికి ఇక్కట్లు

జూన్ నెల కేదార్‌నాథ్ యాత్రకు కీలక సమయం కావడంతో దారిలో కానీ, మందిరాల వద్ద కానీ దాదాపు లక్ష మంది వరకు వున్నారు వరద వచ్చిన సమయంలో. ఇందులో ఒక్క కేదార్‌నాథ్ శిఖరం మీద వున్నవారు మాత్రమే ముంపుకు గురైనారు. గాంధీ సరస్సుకు గండి పడడం వల్ల వచ్చిన ఉపద్రవం అది. బద్రీనాథ్, యమునోత్రి, గంగోత్రి

కొరవ 14వ పేజీలో

## గంగమ్మ తల్లి జన్మభూమి!

హిందువులకు పరమ పవిత్ర నది అయినా గంగమ్మ తల్లి జన్మ స్థానం ఇక్కడే. మందాకిని, భాగీరథి, అలకనంద అనే పేర్లతో కేదార్‌నాథ్, బద్రీనాథ్ మందిరాల మీదుగా మొదలై రుషీకేష్ దగ్గర నుంచి గంగా నదిగా పిలవబడుతుంది. ఈ మధ్యలో దాదాపు పన్నెండు పాయలు ఐదు ప్రదేశాలలో సంగమం చెందుతాయి. వాటినే పంచ ప్రయాగ్ (విష్ణు ప్రయాగ్, నంద ప్రయాగ్, రుద్ర ప్రయాగ్, కర్ణ ప్రయాగ్, దేవ ప్రయాగ్) అని పిలుస్తారు. రుషీకేష్ నుంచి గంగా నది మైదాన ప్రాంతాల మీదుగా ప్రయాణిస్తుంది. గంగోత్రి నుంచి రుషీకేష్ వరకు గంగా, దాని ఉపనదుల ప్రవాహం చూడడం ఒక అద్భుత అనుభూతి. తెల్లని నురగ ఎగచిమ్ముతూ, నల్లటి నీళ్లు, కొండ కోనల నుంచి దుముకుతూ, జలపాతం వలె జారిపడుతూ, లోయలలో బండ రాళ్ల మీద ఎగిసి పడుతూ అది ప్రవహించే తీరు ఎంతసేపు చూసినా తనివి తీరదు. అప్పటి వరకు చెంగున ఎగిరిపడే లేగ దూడను తలపించే గంగమ్మ తల్లి, రుషీకేష్ చేరే సరికి నిండు గర్భిణి వలె గంభీరంగా మారిపోతుంది.

## శంకరాచార్యుల నిర్వాణమూ ఇక్కడే!



పరమ శివుడే ఆదిశంకరాచార్యుని రూపంలో అవతరించి హిందు మతాన్ని పునరుజ్జీవింప చేశాడని భక్తుల నమ్మకం. శంకరాచార్యుల వారి జీవితాన్ని గమనిస్తే ఆయన మనిషి అని నమ్మబుద్ధి కాదు. కేరళ రాష్ట్రంలోని పెరియార్ నది ఒడ్డున కాలడి అనే కుగ్రామంలో జన్మించిన శంకరాచార్యులు పాదం మోపని భూభాగం భరత ఖండంలో కన్పించదు. కేవలం పాదచారిగా ప్రయాణం చేయడం కాదు. తాను అడుగు పెట్టిన ప్రతి ఊరిలోనూ పండితులు, మేధావులు, భిన్న మతాలకు చెందిన ఆచార్యులను తన వాదనా పటిమతో ఓడించి, తాను ప్రతిపాదించిన అద్వైత సిద్ధాంతమే సరైనదని ఒప్పించి, రాజులు, చక్రవర్తులను కూడా పాదాక్రాంతులను చేసుకొన్నాడని ప్రతీతి. ఆయన జీవించినది కేవలం 32ఏళ్లు. ఈ స్వల్ప వ్యవధిలో కేరళ నుంచి కాశ్మీర్ వరకు పర్యటించి, హిమాలయ పర్వత శిఖరాలను అధిరోహించి, మత పరమైన దిగ్విజయ యాత్ర జరపడం మనిషన్న వాడికి సాధ్యమనే నమ్మకం కుదరదు.

శంకరాచార్యుల వారి చివరి పండిత గోష్టి అస్సాం రాష్ట్ర ప్రస్తుత రాజధాని గౌహతిలో అని చరిత్ర చెప్తున్నది. అక్కడ నుంచి ఆయన బదరీనాథ్ మీదుగా కేదార్‌నాథ్ వెళ్లి అదృశ్యమై పోయాడని చెప్తారు. ఆయన నిర్వాణాన్ని చూసిన వారెవరూ లేరని ప్రతీతి. ఆయన కేదార్‌నాథ్ వచ్చిన గుర్తుగా ఆయన సమాధి పేరిట ఒక నిర్మాణం వుంది. ఈ వరదలలో అది విధ్వంసమైపోయింది. అటు పాండవుల పురాణం, ఇటు శంకరాచార్యుల వారి చరిత్రలను అనుసరించి, స్వర్గారోహణ మార్గానికి కేదార్‌నాథ్ మందిరం తొలి మెట్టు అని హిందువుల విశ్వాసం.



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com